ఆంధ్ర సరస్వతీ గ్రంథమాలా ప్రచురణ

శ్రీ

# కనకవల్లి

గ్రంథకర్త

శ్రీ తేకుమళ్ల రాజగోపాలరావు, B. A., L. T.

రాష్ట్రవాణీ పబ్లికేషన్స్
డాక్టరు పట్టాభి రోడ్
మచిలీపట్నం

మూల్యము రు. **2-0-0**

శ్రీ

# కనకపల్లి.

## మొదటి ప్రకరణము.

ఏమిరా! పతంజలిని స్తోత్రము చేయకుండనే శాస్త్రమును నేర్చుకొందునా? ఈపాడు కలియుగములో భక్తియే నశించినది.

శిష్యుఁడు :— ఆ శ్లోకమును మఱచిపోయినానండి. మీ తాటియాకుల పుస్తకము నొకసారి యిటు తెండి.

ఆపస్తంబులవారు కేవలము ఆపస్తంబావతారులే. భరతవర్షమునందు వారివంటి విద్యాధికు లా కాలములో నెవ్వరును లేరు. సాంగోపాంగముగా చతుర్వేదములను నభ్యసించి పౌండరీకాంత శ్రోత్రియైన యీమహర్షి తన శిష్యునికి తాటియాకుల పుస్తకము నొకదాని నిచ్చెను. దానినిఁ దీసికొని శిష్యుఁ డిట్లు పఠించెను.

# కనకవల్లి.

శ్లో. యోగేన చిత్తస్య పదేన వాచా
మలం శరీరస్య చ వైద్యకేన,
యోపాకరోత్తం ప్రవరం మునీనాం
పతంజలిం ప్రాంజలిరానతోఽస్మి.

"ఓరీ! మహాభాష్యమును పఠించువానికి పతంజలిముని స్తోత్ర మెందుకు రాలేదు?"

శిష్యు:—నిన్నటి దినమంతయు నామనస్సు సరిగాలేదండి. నేను మహోపాధ్యాయుఁడను గావలెనో మహామహోపాధ్యాయుఁడను గావలెనో తెలియక ఎంత యాలోచించి నా ననుకొన్నారు?

ఆపస్తం:— సాధు—సాధుపతంజలి మునిని స్తుతింపలేనివానికి మహోపాధ్యాయ బిరుదమా? ముందు అధ్యయనము కానీ! తరువాత ఆలోచింపవచ్చును.

శిష్యు:—ఏమండీ! నేను మీయొద్ద చదువుకొని మహామహోపాధ్యాయుఁడనగుట మీకు గౌరవము కాదా? పోరుగూరువాం డెవ్రిందఱో వచ్చి మీచే పరీక్షింపబఁడి యీ యమరావతిలో మహామహోపాధ్యాయు లగుచుండఁగా నేనును ఆ పదవికి ప్రయత్నింపఁ గూడదా?

ఆప:—అవును. ఇచ్చిన ఒక్క—శ్లోకమునైనను పఠింపలేక ఆలోచనలతో కాలమును పాడుచేసికొనుట మహామహోపాధ్యాయ పదవికి ప్రథమ ప్రయత్నము కాఁబోలు. ఈ ప్రసంగములు చాలించి చదువు ఆరంభించు.

శిష్యు :—ఏమియు కాదండి. నేను కష్టపడి చదివి తప్పకమహా మహోపాధ్యాయుఁడ నగుదు నండి. మొన్నటి మధ్యాహ్నమే కదా నవద్వీపమునుండి వచ్చిన మల్లినాథుఁడు మీచే మహామహోపాధ్యాయుఁ డైనాఁడు? అట్టివారిని చూచుట మావంటి బాలురకు ఉత్సాహ కారణము కాదా! నేఁ డాతఁడు మీచే పరీక్షింపఁ బడినాఁడు. ఱేఁ పాతఁడు రాజసభలలో పండితాగ్రణి యగుచున్నాఁడు. నవద్వీపములోనే మహామహోపాధ్యాయ పట్టము లిచ్చుచుండఁగా నితఁ డీ యమరావతి కేల రావలెనండి?

ఆప :—లోకులు మనయూరి కొక గౌరవము నిచ్చినారు.

శిష్యు :—మహామహోపాధ్యాయుఁడు కాఁగోరు ప్రతివాఁడును మన యూరిలోని యా పెద్దగంటను వాయించవలెనా? అది చాల మెత్తు. అది నాకు అందదు.

ఆప :—నా చిన్నతనములో కాశీనగరమునందు మొదటిసారి నేను గంటవాయించి నప్పుడు నన్నెవ్వరును లక్ష్యము చేయలేదు. రెండవసారి యొక బ్రాహ్మణుఁడు వచ్చి వాయించ రాదని నాకు బుద్ధి చెప్పెను. మూఁడవసారి కొందఱు పండితులు నన్నుఏపని కీ గంట వాయించుచున్నావని యడిగిరి. ఒకశాస్త్రమును పరీక్ష నిచ్చువాఁడు మహోపాధ్యాయుఁడు. అఱుశాస్త్రములలోను పరీక్షనిచ్చువాఁడు మహామహోపాధ్యాయుఁడు. ఈ కడపటి పట్టము నకై గంట వాయించుచున్నానని నేను చెప్పితిని.

శిష్యు :—మీ చిన్ననాఁడు పరీక్ష లంతకష్టముగా నుండెడివా?

ఆప :—అప్పటి పరీక్షాపద్ధతులను వివరించెదను వినుము. దిగ్దంతులవంటి పండితులు వచ్చి పరీక్షితునితో శాస్త్ర ప్రసంగము చేయుదురు. వానికి ఆఱుమాసములు వ్యవధి. ఈకాలములో వాఁడేయే పుస్తకములు కోరినను నొసఁగఁ బడును. ప్రశ్నల కుత్తరములకై ఎన్ని గ్రంథములనైన పరీక్షింపఁబడువాఁడు శోధింపవచ్చును గాని ఇతరులనుండి మాత్రము నేర్చుకొనుటకు వాని కధికారములేదు. అన్న పానాదు లొసంగుచు వానిని పండితులు సర్వదా కాచియే చూచుచుందురు.

శిష్యు :—ఏవో నాలుగు సమాధానములు చెప్పుటకు ఆఱు మాసము లెందుకండి ?

ఆప :—ప్రతి సమాధానమునకును పరీక్షకులు అడ్డుప్రశ్నలు వేయుచుందురు. శాస్త్రసంబంధమైన పూర్వపక్షము లెన్నివచ్చినను బుద్ధిప్రయోగమువలన శాస్త్రసిద్ధముగా పరీక్షితుఁడు సమాధానములు చెప్పవలెను. ఒక్కొక్క ప్రసంగము ముగియుసరికి ఆశాస్త్రములోని విషయశతము లెన్నియో సంపూర్ణముగా చర్చింపఁ బడియుండును. ఇది కేవలము గుడ్డిగా పాఠములు చదువుట వంటిది గాదు. దీనికి ధీశక్తికూడ చాల ఉండవలెను. దిగ్దంతుల వంటి పండితులుచేయు పూర్వపక్షముల కుత్తరములిచ్చుటకు ఎంతటి సమర్థత కావలెనో చూచుకో? అందువలననే

## మొదటి ప్రకరణము.

భరతవర్షములోని బ్రాహ్మణులకున్న తెలివితేటలు లోకములో నెవ్వరికిని లేవు. ఏ విషయములో నైన నసమర్థత యుండినయెడల ఆ బాలునికి మహోపాధ్యాయపదవి లభింపదు. అట్టి పండిత మండలమును ఎన్ని శాస్త్రములలోనో మెప్పించినఁగాని మహామహోపాధ్యాయపదవి రాదు.

శిష్య :—ఇందువలననేనా మీరు గంటకొట్టిన వెంటనే వారు మీకు మహామహోపాధ్యాయపదవి నీయలేదు ?

ఆప :—అవును ! అంతలోనే యిచ్చుట కది తేఱతేఱగా నున్నదా ? భరతవర్షమంతలోను పది యిరువది మంది కంటె నెక్కుడు మహామహోపాధ్యాయులు లేరు. ఎట్టివారి కది లభించును ?

శిష్య :— లోకవిఖ్యాతులైన మీవంటివారినిఁగూడ వారింత కష్టపెట్టవలెనా ?

ఆప : విఖ్యాతితో నీకు పనిలేదు. ముందు భాష్యము చదువు.

శిష్య :—బాల్యము కాబట్టి ఉత్సాహవశమున తమరిని ఇన్ని ప్రశ్నము లడిగితిని. మన్నింపుడు. యవనబర్బరాది దేశములలోకూడ మహామహోపాధ్యాయు లున్నారా ?

ఆప :—ఆ దేశములా ? అక్కడ ఇటువంటి పండితు లెక్కడ. కూటికి లేక కాయక్లేశము చేసికొనుచు ఆనాఁటికి పొట్ట పోసికొన్న చాలునని చరించువారికి విద్యాభివృద్ధులకు

తావు ఎక్కడ ఉండును? అక్కడ విద్యలకు సౌకర్యములు ఎట్లు కలుగును ?

శిష్యు :— భరతవర్షములో మాత్రమేల—

ఆప :—ఓరీ విద్యార్థులకు మాధుకరమిచ్చు నాచారము మన దేశములో మాత్రమేకలదు. చదువుకొనువారికి మన దేశములోనున్న సౌకర్యములు అన్యదేశములలోలేవు. అతిథులని, అభ్యాగతులని, విద్యార్థులని భరతవర్షములో మన పూర్వులుచేసిన సౌకర్యములు దేశోన్నతికి కారణములు. ఆ దేశములలో విద్యావ్యాపకమునకు తగినకట్టుబాటులేనైన నున్నవా? చదువునకు ఒక్కగవ్వయైన వ్యయము గాకుండ ఇన్ని సదుపాయములు చేసిన భరతభూమివంటి దేశ మీ ప్రపంచములో నేదైన కలదా ?

శిష్యు :— బాలురచే నోరు తిరుగని సంస్కృత శ్లోకములను వల్లె వేయించుటకు ఇన్ని సదుపాయము లెందుకు ? ఎన్ని పరీక్షలైనను ఎవ్వరో వ్రాసిపెట్టిన శాస్త్రములోని యభిప్రాయములనే సిద్ధాంతీకరించుటకు గదా? పెద్దవాడనైన తరువాత నా యభిప్రాయములతో భాస్కరీయమని నేనును నొకశాస్త్రమును వ్రాయుదును.

ఆప :—నోటికి వచ్చినదంతయు శాస్త్రమగునా ? అట్లైని యీ ప్రపంచములో కోట్లకొలది శాస్త్రము లుండియుండును. శాస్త్ర మెట్టిదో నీవెఱుఁగవు. ఆపాణినినే ఆగౌతమునే

ఆకాణాదునే ఎల్లవారును ఎందుకు అంగీకరింపవలెనో నీవే ఆలోచించుకో?

భాస్కరుడు—(ఆలోచించి) అవును. సర్వజనాంగీకారార్హములగు విషయములే వారియం దుండుటచేత. దీనినిబట్టి భరతవర్షములోని తర్కాదివిద్యలు యుక్తిప్రమాణ జనితములై, బుద్ధిని వికసింపఁ జేయుచు మానవకోటి కంతకును నంగీకారార్హమగు సామాన్య ధర్మములనే నేర్పుచుండవలెను. నా యూహ సత్యమేనా?

ఆః—వేద ప్రమాణములు సహితము అట్లగుటచేతనే అంగీకృతమైనవి. ఏనుఁగునకు ఐదుకాళ్ళని యెచ్చటనైన నున్న యెడల మన యిప్పటి విద్వాంసులు అట్టి గ్రంథమును బ్రతుకనిత్తురా? పూర్వపక్షములు చేసిచేసి వానిదుంప తెంపి అక్కడకును ఆగిననేకదా అది యంగీకారార్హమని వారు వచింతురు. చార్వాకులు బౌద్ధులు కాపాలికులు మున్నగు మతవిరోధుల ధాటికి సామాన్య వాక్యములు నిలుచునా? భరతవర్షములోనిసమస్తశాస్త్రములునుఇట్టివే పాణిని అ ఆ లను క ఖ లను వ్రాయుచు శరీరావయవముల నెత్తుకొని అక్షర జన్యస్థానములను వచించి శబ్దలక్షణము చేయఁగా అందలి విషయములు ప్రపంచములోని సమస్త భాషల ధ్వనులకును మూలాధారమైనవి. ఒక్క సంధి విషయమై యాతఁడు వ్రాయఁగా సమస్త భాషలలోని పదముల యుచ్చారణకును వేగసూచకములగు ధర్మ

ములం దిమిడినవి. ప్రీతి తత్వమును చర్చించి అమోఘ మైన విషయములను మాత్రము స్వీకరించి సూత్రప్రాయ మున వచించిననేగాని శాస్త్ర మెట్లు ఉత్పత్త్యభివృద్ధుల నందఁగలదు ?

భాస్క—చదువుకొను బాలురు "భిక్షాందేహి" అని యవ నాది దేశములలో మాత్రము యాచింపరాదా ?

ఆప—అచ్చటి జనులు అంత తెలివితో మాధుకరము పెట్టుదు రేని వారును మనవారివలెనే బుద్ధిమదగ్రగణ్యులై యుందురు.

భాస్క—నాకు నక్షత్ర గణితమునందు ప్రీతి. శుక్రుఁడు ప్రతి దినమునుఁ తెల్లవాఱు జామున నే ఏలవచ్చునండి? పురాణ ములు చంద్రునికి చెప్పినక్షయకారణము నాలెక్కలతో సరిపోలేదు. ఇది యటుండనిండు. సరిగా నడిరేయికి నేఁ డాకాశ మధ్యముననున్న చుక్క తేఁపుకొంచెము ముందు గానే ఆకాశమధ్యమునకు వచ్చుచుండును. తర్కాదులకు వలెనే గణితాదులకును మనమేల శాస్త్రము చేయరాదు ? నేను వేసిన కొన్ని లెక్కలు సూత్రములవలె నా కుపయో గించుచున్నవి. ఇది యెట్లండి—

ఆప :—ఓరీ ఎన్ని విద్యలను నేర్చినను జ్యోతిషమును మా త్రము నీవు మఱచిపోకుమీ. మనయాంధ్రులకు త్వర లోనే యుద్ధములు పొసఁగ నున్నవి. అప్పుడు నీగణిత ములు మగధరాజ్యాధిపతులను జయించుటకు మన కను కూలించును.

భాస్క:—మనకు మగధరాజ్యముతో యుద్ధమెందుకండి? మగధను జయించినను, మనము దానిని కట్టుకొని పోవుదుమా?

ఆప:—ఆ సుశర్మహతకుఁడు మన శ్రీముఖచక్రవర్తిని చెఱలోఁ బెట్టలేదా? వానిసైన్యములు చెలరేఁగి మనదేశముపైఁ బడి బాలురను జంపియు, స్త్రీలను జెఱఁగొనియు, ఊళ్లను దోఁచియు, పట్టణములను గాల్చియు, పొలములను నిర్మూలము చేసియు, తుట్టతుదకు ఋష్యాశ్రమములను సహితము నాశము చేసియు మనకు నానాబాధలను గలిగించుట లేదా? మనరాజు చెఱవదల్చి మన యాంధ్రులకు అభయ మొసఁగుట మన పనికాదా?

భాస్క:—అది వీరపురుషుల పని. కార్మికులైన సాధుబ్రాహ్మణులందేమి చేయగలరు?

ఆప:—ఓరీ! శౌర్యమునకు జాతివివక్షత యెక్కడిది? ఆ ద్రోణుఁడు, ఆ కృపుఁడు, ఆ యశ్వత్థా . . . . . నెవరు? బుద్ధిమదగ్రగణ్యుల యుక్తి సహాయములేక కేవల బాహుబల మేమిచేయఁగలదు? విద్యయనఁగాబుద్ధి వికసనము. ఈనాఁడు బ్రాహ్మణులయందే వ్యాప్తము. అందువలననే కదా అమరావతిలోని పండితులు కొందఱు రేఁపు మూఁడవ యామమున మంత్రీంద్రుఁడైన భట్టబాణునియింట సభ కూడ నున్నారు?

భాస్క :—ఈ వేదవిద్బృంద మంతయు నాలోచనలకు దొర కొనునేని ఝూరీచెంబులే యమ్ములును దర్భాసనములే విండ్లును, మంత్రోచ్చారణములే భేరికాభాంకరణములును సత్వగుణమే యుద్ధవిజయ సాధనమునునై జేపుఁరానున్న యపజయము నేఁడే మనకు సిద్ధించును ! రాజనీతినిపుణు లైన మంత్రిజ్ఞులు చేయవలసినపనిని వైదిక బృందమున కొసఁగుట ఆంధ్రవిజయమునకు ప్రథమోపాయము కాఁబో లును ! ఇది మన మంత్రీంద్రుని తెలివియా పండితోత్త ముల మతాభిమానమా ?

ఆప :—ఓరీ ! చిన్ననోటికి పెద్దమాటలు వచ్చుచున్నవి. పిట్ట కొంచెము కూఁత ఘనము నన్నట్లు నీవేమో పెద్దపెద్ద మాటలు మాటాడుచున్నావు ఇఁక నోరు మూసికో.

భాస్క :— అది కాదండి ! మాగధుల బౌద్ధ సిద్ధాంతమును పూర్వపక్షము చేయుటకు ఝూరీచెంబు లెన్నివచ్చినను మేలే. కాని కత్తులు కటారులు నూరుపనుల కీనైష్ఠిక పఙ్క్తు లేమిప్రయోజనము! దూడగడ్డిని కోయుటకు కొం కాయమాన్రిన కెగఁబాకు మూఢులుందురా ?

ఇంతలో దండకారణ్య నివాసులైన అత్రి, కశ్యప, గౌతమ, వసిష్ఠ, విశ్వామిత్రాది మహర్షులందఱును నిజశిష్య బృందములతో నాపస్తంబుని వీటి కరుదెంచిరి. చిన్నఁబోయిన వదనములే వారి మనోవ్యాకులతను సూచించుచుండెను. ఆపస్తంబుఁడు వారిని కొంత దూరముననే చూచి తత్క్షణమే

యెదురేగి యర్ఘ్యావిధుల నాదరించి యింటికి గొనితెచ్చి భద్రాసనాసీనులను జేసి వినయముతో నిట్లనియె.

"త్రిభువన పూజ్యులైన మహర్షి సత్తములారా! తమ రాకవలన నాజన్మము సఫలమైనది. నాయిల్లు పావనమైనది. ఎంతెంత వారలకును నలభ్యులైన మీరేమికతమున నీకుక్షింభరుండైన పామరుని పవిత్రీభూతునిం జేయుచున్నారో నేనడుగవచ్చునా? మహా సార్వభౌముల యొక్కయు సమ్రాట్టుల యొక్కయు మహారజత కిరీటములందు స్థగితములైన వెలలేని రత్నకోట్లు ఏ మహర్షి సత్తముల పాదములకు నీరాజనము లగుచుండునో యట్టి బ్రహ్మస్వరూపులగు తమకు ఏదాస్య మొనర్చి యీపేదంబాపండు జన్మసాఫల్యము నందంగలండు?"

చిరు నగవుతో విశ్వామిత్రుం డిట్లనియె.

"జననము ఉత్తర భూమండలమేయైనను, నాతనయులను ఆంధ్రులనుగావించి యీ దండకారణ్యమునకు గాంపు వెట్టి నేనును నా సహచరులైన యీ మునీంద్రులును నిశ్చింతగా ఈ యరణ్యమునందే స్థిరనివాసము లేర్పఱుచుకొని అడవులంబట్టి వసించుచుంటిమి. నా మిత్రులైన యీ ఋషికోటుల వాసకారణమున ఆంధ్రదేశములోని యరణ్యములు సహితము ఉన్నత విద్యాలయములై నాగరికతకాంచి యొసలారుచుండెను. వీరి కారణమున వారణాస్యాది పురముల కంటెను నున్నతవిద్యల కాకరమై, తపస్సంపన్నులైన మునీం

ద్రుల పుణ్యమున పవిత్రావాసమై దండకారణ్యము ప్రపంచ మునకుఁ దిలకాయమానమై యుండెను.

“శాంతరసమునకుఁ బేరుకాంచిన మాయావాసములను నేఁడు సుశర్మాభిధానుఁడు బౌద్ధుఁడొకఁడు నిర్మూలముచేసి, మమ్ములను తిట్టి కొట్టి పలుబాములఁబెట్టి ప్రపంచము నబ్రాహ్మణము చేయుదునని శపథము గావించి యున్నాఁడు. ఆది కాలమున రాక్షస బాధనుండి రక్షించుటకు ఉత్తర రాజ్యముల రాజులే మాకు దిక్కైనను ఇప్పుడు వారి ప్రభ యణఁగినది. దండకారణ్యవాసులగు నా యేఁబదిమంది కుమారుల వంశమునను బుట్టిన మీ ప్రభ హెచ్చినది. మీ వంశమున కాది పురుషుఁడవైన నాకును నా మిత్రులకును మీ రభయ మొసఁగి కాపాడలేరా? ”

ఆపస్తంబుఁడు అద్భుత విషాందోళి తాంతఃకరణుఁ డయ్యెను.

“అసమర్థుఁడను. కించిజ్జ్ఞుఁడను. శాంతగుణప్రధానమైన బ్రాహ్మణవంశమున జన్మించినవాఁడను. ఇట్టి నేను లోకభీకరుఁడైన సుశర్మఘాతకుని క్షాత్రమున నెట్లు జయింపఁ గలుగుదును. అయినను తమ యాశీస్సులే అధర్మదేవతకు మృత్యురూపకములైన యస్త్రములు. వాని బలముతో సెల వేని తమ యాజ్ఞలను శిరసావహించి చేయుమన్నట్లు చేయఁ బూనువాఁడను.”

వసిష్ఠుఁ డిట్లనియె. "మిత్రమా? ఆదికాలమున శ్రీ రామాదులు మమ్ముద్ధరించిరి. ఇప్పుడు శ్రీముఖుఁడు మమ్ముఁ గాపాడఁగర్త. చంద్రగుప్తునికి చాణక్యుఁడెట్లో శ్రీముఖునకు నీవును నట్టివాఁడవు. విషయ విశేషములు భట్టబాణుని యెదుట నీవే మాకు తెలుపఁగలవు."

ఆప :—తమ పవిత్ర పాదధూళి సోఁకినకతమున మార్గము నందలి యేయే దగ్ధాంధ్రరాష్ట్రములు పునరుజ్జీవితము లైనవి ?

కశ్యపుఁడిట్లనియె :—సముద్రమువలన కౌస్తుభమును చంద్రునివలన నమృతమును నుదయించినట్లే విశ్వామిత్రుని వలన నాంధ్రు లుదయించిరిగదా. అట్లే పశుపక్ష్యాది జీవరాసులన్నియు నావలనఁ గలిగినవి. వింధ్యపర్వతప్రాంతము లందలి మాయాశ్రమములను వదలినది మొదలుకొని యీ యమరావతినిఁ జేరినదాఁక ఎందుఁ జూచినను చచ్చిన కళేబరములును, వానిని బీకుకొని తిను గ్రద్దలును రాఁబందులును, కడుపాఁకలిచే నేలఁద్రెళ్లి నోరు తెఱచుచున్న ఏకాకులగు శిశువులును, సుతమరణమున కేడ్చు నాంధ్రసతుల బలాత్కరించు మాగధులునే మాకు గోచరమగుచు హృదయ శూలముగా నుండెను. అక్కటా ! నా సంతతికి నేను బ్రతికి యుండగనే యెట్టి దురవస్థ పట్టినది !

శిష్యులింతలో మాధుకరాన్నములను గొని తెచ్చిరి.

ఆప:—మనమిఁక కృష్ణాస్నానము చేయ నరుగుదుమా.

ఎల్లరును తమతమ కమండలములతోఁ గృష్ణాతీరమున కరిగిరి.

—0-

# రెండవ ప్రకరణము.



పాటలీ పుత్రమునందు తత్పురాధీశ్వరుఁడు సుశర్మాభి ధానుఁడు మంత్రి సామంత దండనాథాదులతో నిండు పేరో లగముండెను. నగరమంతయు నానాఁడు నిండుగా నలంక రింపఁబడియుండెను. ఎటుప్రక్కఁ జూచినను బారులుతీర్చి రాజభటులు కావలి కాయుచుండిరి. వీధులయందు అనఁటి కంబములతో మండపములుకట్టి వానిపైన తెల్లని గుడ్డలను పఱచి జనులు పాదరసపు బుడ్లతో వాని నలంకరించియుంచిరి. కొందఱు పౌరులు "జయజయ సుశర్మ చక్రవర్తి" అనియు "బుద్ధంశరణం గచ్ఛామి" "సంఘంశరణం గచ్ఛామి" "ధర్మంశరణంగచ్ఛామి" అనియు బావుటాలు కట్టి మండప ముల కిరుపార్శ్వములను నలంకరించి యుంచిరి. ఏనుఁగు నాకారముల నందందు నిర్మించి వాని తుండములలో పన్నీరు చల్లిన పుష్పములనుంచి, భద్రగజారూఢుఁడై చక్రవర్తి రాఁగానే యాతని నర్చించుటకుఁ గొన్నిచోట్ల పురజనులు నిర్మాణములు కావించి యుంచిరి. పురమందలి యిండ్లు సున్నపుఁ బూతచే ధవళిమను గ్రక్కుచు పాటలీపుత్రపు ప్రాచీనకీర్తినిఁ బ్రకటించుచుండెను. సీమంతినీమణులు బం గరు పళ్లెరములలో వసంతములను కర్పూర నీరాజనములను రాజున కొసఁగుటకై సిద్ధము చేసియుంచిరి. అగురుచందనా

దుల పరిమళములు మల్లికా ప్రసూనాదుల సువాసనలతోఁ జేరి పురమునంతను కమ్మని వాయువులతో వాసింపఁజేయు చుండెను. అమలినములై పరిశుభ్రములై ధౌత వస్త్రాలం కృతులైన జననివహములచేఁ బూర్ణములై సందుగొందులు సహిత మానాఁడు బుద్ధదేవుని హృదయ పీఠమువలెనే స్వచ్ఛములై భాసిల్లుచుండెను. కమండలధారులై కాషాయ వస్త్రాలంకృతులై క్షురితములైన శిరములతో బుద్ధవాక్యములను స్మరించుచు సన్యాసు లానాఁడు రాజమార్గములందు విచ్చల విడి సంచారములు చేయుచుండిరి. సుశర్మ చక్రవర్తి తన సభయందు కొంతవడి యాలోచనము నెఱపి కట్టకడపట.—

"మంత్రీంద్రా! సుబుద్ధీ! నీ వాక్యములు ప్రశంసనీయములే. కాని నేఁడా శ్రీముఖుఁడు మదపు టేనుంగులచేఁ ద్రొక్కింపఁ బడునని యిదివఱకే మనము పురమందుఁ జాటఁ బంచినాము. వేలకొలఁది పౌరులీ యాంధ్రశత్రువు మరణమును వీక్షించుటకై యిదివరకే వధ్యస్థానమును జేరియున్నారు. ఇంతకును ఆంధ్రులు మనకు గర్భశత్రువులు. ఋణాగ్నిశత్రుశేషములను మిగుల్చుట రాజనీతికాదు." అని చెప్పెను.

మంత్రీంద్రుఁడు తన యసమ్మతిని సూచించుచు రాజేంద్రుని మొగమువంకఁ జూచెను. రాజిట్లనియె.

'మంత్రిపుంగవా! బ్రాహ్మణులందఱును నాశనమగుదురుగాక. లోక మబ్రాహ్మణము కావలెను. వారికి వశులైన

యీ భూలోకములోని యాంధ్రులందఱును నశింపవలెను. మన కింకను గొప్ప పనికలదు. శ్రీముఖుని పట్టినంతనే యాంధ్రులు మనకు లోఁబడి పోలేదు. ఇంకను కళింగ విదర్భామరావత్యా ద్యాంధ్ర దేశము లెన్నియో కలవు. ధైర్యముతో ఉత్సాహముతో శ్రమలకోర్చి లోకమునందు మచ్చునకైన నొక్క యాంధ్రకీటకము లేకుండునట్లు ప్రపంచమును నిరాంధ్రమొనర్చినఁగాని విజిగీష మనకు చెల్లదు. యాష్టి ప్రాసికనైస్త్రింశిక పారశ్వధిక సాహస్రములతో భోగ మండలా సంహత వ్యూహత్రయ భేదములను సమయాను కూలముగాఁ బన్నుచు మన మిప్పుడు నెఱపవలసిన దుర్ఘట లెన్నియో యున్నవి. దొరికిన శ్రీముఖుని వెంటనే చంపివేయుదము. ఆంధ్రపక్షపాతివైనా నావింటికి గుఱిగాక వెంటనే నాయాలోచనము నంగీకరింపుము."

మంత్రీంద్రుఁడు రాజువాక్యములను శిరసావహించెను. రాజశిఖామణీ! త్రిభువనవిజయైక దక్షులగు తమకొక యుద్ధ కలదా? క్రియరూపక్షముగాఁ దోఁచినను, దానినిఁ గల్పించు నాలోచనము నిదానముగాఁ బరిశీలింపవలసిన సాత్త్విక విషయముగావున విషయ విమర్శనార్థమై శ్రీముఖుని వధను గూర్చి నేనట్లు పలికితినే కాని శత్రుశేషము నుంచరాదను నీతిని నేనెఱుఁగనా? భువనవిఖ్యాతమైన పాటలీ పుత్రమునకుఁ బదితరములనుండి యనాహతశత్రువులుగానుండిన యాంధ్రులను జయించుటకంటె నధికకీర్తి ప్రదమైన కార్యము వేఱొం

డుకలదా? మాగధులకు ప్రాణశత్రువైన యాశ్రీముఖుని యుసురులు నేఁటితో కడముట్టును గాక."

"జయజయ సుశర్మచక్రవర్తీ." యని సభనుండి యుచ్చైస్స్వరముతో శబ్దములు పైకి లేచెను.

సుశర్మ ఇట్లు ప్రకటించెను.

"ఇదియే రాజాజ్ఞ. ఆంధ్రులు మగధపురాధీశ్వరులకుఁ బ్రబలవిరోధులు. ఎక్కడ ఏయాంధ్రుఁడు కానవచ్చినను వానినిఁ బట్టి వెంటనే మా కారాగృహాధికారికి పురజనులు అప్పగించవలసినది. స్త్రీశిశుసహితముగా లోకము ననాంధ్రముగావించి పాటలీపుత్రమునకు నాపురజనులు శాశ్వతకీర్తులను సంపాదింతురు గాక. దండనాథా! నీ సేనానివహము లెట్లున్నవి?"

దండనాథుఁ డిట్లనియె:

"దేవా! ఒకరథము. ఒక యేనుఁగు, మూఁడు గుఱ్ఱములు అయిదుగురు బంట్లును గల యొక్కొక్క పత్తినే నేను వేలువేలుగా ఆంధ్రదేశమునకుఁ బంపియున్నాను. ఇప్పుడు శ్రీముఖునిరాజ్యములోనిట్టి మనపత్తులన్నియుఁ జేరి యెన్ని సేనాముఖములైనవో యెన్నిగుల్మములు వాహినులు. పృతనలు, చనువులు, అనీకిములు అయినవో నేను చెప్పఁజాలను. రెండు అక్షౌహిణులసేన ఇదివఱకే ఆంధ్రరాజ్యముల మీఁదఁ బడి వానిని నిర్మూలము చేయుచున్నది."

దౌవారికుఁడువచ్చి రాజునకు నమస్కరించెను.

సుశర్మ :—చిత్రగుప్తా! ఏమి సమాచారము ?

చిత్రగు :—ఏలికకు జయమగుఁగాక! అమరావతీపుర ప్రధాన మంత్రి భట్టబాణుఁడు ఏలినవారికి ఎవ్వియో విషయ విశేషములను నివేదింపవలెనని కోరుచున్నాఁడు.

సుశర్మ :— దండనాథా ! ఆంధ్రులతో మనకేమియుఁ బని లేదు. నీవు వెంటనే భట్టబాణుని బంధించి కారాగృహ మున వేయింపుము.

సుబుద్ధి :—దేవరకు జయమగుఁగాత! ప్రధాన మంత్రీంద్రుఁ డెద్దియో మహాకార్యము లేక స్వయముగా అరక్షితుఁడై దేవరసన్నిధికి రాఁడు. విషయమునువిని పిమ్మటనే అత నిని కారాగృహ బద్ధునిఁజేయ—

సుశర్మ :- -భట్టబాణునిఁ గొనిరా నాజ్ఞనొసఁగితిని.

అనర్ఘ్యములైన రత్నముల నుపాయముగాఁగొని భట్ట బాణుఁడు బౌద్ధునియెదుట నిలిచెను. సుశర్మ క్రూరకఠోర వీక్షణములతో నతినీచముగా నాతని వంకఁజూచి "ఓరీ! ఆంధ్రపశువా ! చక్రవర్తితో నీకేమిపని " యని యడిగెను. భట్టబాణుఁడు స్ఫురద్రూపి. వ్యూఢోరస్కుఁడును, వృష స్కంధుఁడును, సాలప్రాంశుఁడును, మహాభుజుఁడును ఆత్మ కర్మక్షమమైన దేహము గలవాఁడును, చక్రవర్తి రూక్షవీక్ష ణముల నాతఁడు సరకుఁగొనలేదు.

విఖ్యాత విద్యానవద్యుఁడై భట్ట బిరుదాంచితుఁడైన యా పండితోత్తముఁడు రాజువంకకుఁజూచి "దేవా ! శ్రీ

ముఖుని మంత్రి భట్టబాణుఁడిదే యభివాదనము చేయుచు న్నాఁడు. ఆంధ్రరాజన్య మహాభూరి కిరీటస్థగితములైన రత్న ములు ఏ చక్రవర్తి పాదములకు నిరంతరము నీకమీాద నీ రాజనములిడునో అట్టి సార్వభౌమున కివియే యుపాయన ములు. గోదావరీగర్భ జనితములగు నమూల్య వజ్రములతోఁ జేయఁబడిన యీా రత్నహారము పూర్వము ఆంధ్రుఁడైన నల చక్రవర్తికి దమయంతీ వివాహ సమయమున విదర్భాధిపుఁ డగు భీమునిచే నీయఁబడినది. అశోక చంద్రగుప్తాది మహార్యు లకు సహితము అలభ్యమైన యీా మణిదామమును ఏలిక స్వీకరించి ఆంధ్రరాజ్యమునకు పట్టాభిషిక్తు లగుదురుగాక! భోగభాగ్య పరిపూర్ణులై మున్ను ఏ యాంధ్రరాజు పరిపాలన మునను బడయని యున్నతిని ఏలిక కాలములో నందవలెనను నాశతో నమరావతీ జనులు తమ రాజ్యపరిపాలనకు వేచి యున్నారు. ఆంధ్రరాజ్యమును స్వీకరించి ప్రజలకు అభయ ప్రదానము చేయుటకు మీాకంటె దాతలు వేఱెవరున్నారు? ఏ చక్రవర్తి యాజ్ఞలు ఆసేతుహిమాచల పర్యంతము నిరా ఘాటముగా వర్తించుచు నందలిజనులకు సమస్త సౌఖ్యములను ప్రసాదింపుచున్నవో, అట్టి పాటలీ పురాధిపుని సుశర్మ సార్వ భౌముని కన్నులారఁగాంచి గౌరవించుభాగ్యము నేఁటికి నాకు లభించినది. దీనావనములై ధర్మానుగుణములై పవిత్రములైన రాజాజ్ఞలు ఆంధ్రుల కెప్పుడును దైవతాజ్ఞలై విరాజిల్లుచుం డును. "నావిష్ణుః పృథ్వీపతిః" యనునట్లు రాజు మా కెప్పు డును నీశ్వరాంశ సంభూతుఁడు. అందును సార్వభౌములగు

మీరు మాకు కేవలము బుద్ధావతారులు. ఓ కల్యాణస్వ రూపా! శ్రీముఖ వియోగమువలన నవదయై పడియున్న మా యాంధ్రరాజ్య లక్ష్మిని తాము వరించి మాకు శ్రేయో ఽభివృద్ధులను గూర్తురుగాక. ఏలినవారు మా యాంధ్రుల పట్ల ప్రసన్నులేని, ఏలికకీ యల్పరాజ్య సంరక్షణ మొక భారముకాదేని తక్కిన విషయములను మేము జేపటి దిన మున ఏలినవారికి నివేదింపఁగలము. కడుదూరమునుండి రావలసి వచ్చుటచే తమ సామంత నృపతులొక దినము వెనుకఁబడినవారు. లేదేని నేఁడే ఎల్లవారును దేవర పాద ములకుఁ బ్రణమిల్లి మగధ రాజ్యమునకు సామంతులై యుందురు. ”

సుశర్మహృదయము ఉయ్యాలవలె వెనుకకు ముందునకు నూఁగసాగెను. ఆంధ్రులందఱు నాశనమైనవెనుక ఆంధ్ర రాజ్యము తన కెందుకు? మనుజులులేని దేశములకు రాచఱిక మున్నదా? “ కానీ! జేఁపు సాయంతనమున రాజులెల్లరును రానీ! అంతవఱకు భట్టబాణునిమాట కల్లయో నిజమో? సామంతు లెల్లరును వచ్చి నాకు కానుకలిచ్చి యర్చించిన యెడల ఇఁక యుద్ధముతోఁబని యేమియున్నది? ఇంతకును సుబుద్ధి జయించినాఁడు. శ్రీముఖుని సంహరించుటకిది సమ యముకాదు. ఓయీ భట్టబాణా! నీ వచనములు మాకు యోచనార్హములే! సామంతు లెల్లరును జేఁపటిదినమున మా సన్నిధికి వత్తురేని మేము మీ కభయ మీఁగఁలము. దండనాథా! నీవీ భట్టబాణుని నుచితరీతిని గౌరవించి మన

కేళీ మంటపమున విడియుంచునది. సుబుద్ధీ! మనము పుర వీధుల స్వారివెడలి వత్తమురా! ”

మహోత్సవముతో రాజేంద్రుఁడు భద్రగజారూఢుఁ డయ్యెను. ముందు దుందుభిధ్వానములును సన్నాయిమేళ ములును చెలఁగుచుండెను. ఆవెనుక బారులుతీర్చి రాజ భటులు నడచుచుండిరి. వారి పిఱుందన వందిగాయక సందో హములు జయజయధ్వనులు చేయుచుండెను. వారి తరువాత భోగకాంతలు పాడుచు ఆఁడుచు సైఁగలనుజేసి యభినయ ములను జూపుచుండిరి. అటువెనుక అంగరక్షక సైన్యములును వారినడుమ రాజును మంత్రియు దండనాథుఁడును నుచిత వాహనారూఢులై యుండిరి. ఎందుఁ జూచినను బుద్ధసన్న్యా సులే మెండుగాఁ గానవచ్చుచుండిరి. ఇంటింటికడను రత్న నీరాజనములు కర్పూర నీరాజనములు రాజునకు సమర్పింపఁ బడుచుండెను. అందగత్తెలను నిదానించిచూచి వారియిండ్ల నరయుచు, అమూల్యమణి ఖచితమై ధగద్ధగాయమానముగా నున్న రత్నకిరీటమును ధరించుకొని, పీతాంబరములను గట్టు కొని భట్టబాణుఁ డొసఁగిన మణిదామమును మెడయం దుంచుకొని, నవమోహనా కారుఁడగు సుశర్మ సార్వభౌ ముఁడు పురవీధుల విజయంజేసి, తుట్టతుదకు తన సంకేత మంటపము చేరెను.

—0—

# మూడవ ప్రకరణము.



శివుని జటాజూటమునుండి వెలువడి నిరర్గళ ప్రవాహముగాఁ బ్రవహించు గంగాతరంగిణి పాటలీపుత్త్రమున కుత్తర దిగ్భాగమునందు కలదు. దేవతాప్రసూనములను దిరస్కరించు తెల్లని నురుగులతోను, తెలినురుగుల పొంత విస్తరించు కర్పూర తరురాజములకుఁ జీవనములొసఁగు సుడిగుండముల తోను, సుడిగుండముల దరినుండి తెలిమబ్బులను సహితము సరకు గొనకుండ విజృంభించు విశాలములైన యేళ్ళతోను దేవతాకీర్తుల నపహసించుచు కైలాసపతిరాణి గంగాభవాని పాటలీపుత్త్రమును బవిత్రీభూతము చేయుచుండును. దురిత భంగములగు భంగములును, భంగమ్ముల యొఱయికచే నెగయు ముక్తి కన్యావశీకరంబులగు శీకరంబులును గలిగి పరిశోభితకువలయంబై మహామేరువురీతి ననేక చక్రసంచార సమృద్ధంబై మహాభారతంబు భాతి ననేక భగవద్గీతంబై మహా భాష్యంబు చాడ్పున వృద్ధిగుణ సమర్థంబై వేదంబుంబలె బ్రహ్మాక్షరపదక్రమ సంధానంబై పరబ్రహ్మంబుపోల్కి నతి క్రాంతానంత నిగమంబై ఛందోవ్యాకరణాద్యంగములగతి గురులఘు వాక్యచ్ఛటా నిర్ణయంబైన యీ పవిత్రాపగ ప్రపంచమున కంతకును మోక్షంబు నొడఁగూర్చుచుండును.

ఇట్టి గంగాతరంగిణి పొంత జరాసంధుని మునిమనుమని మునిమనుమఁడను బృహత్సేనునిచే నభేద్యముగా నిర్మింపఁ బడిన యొక్క శిలామయ కారాగారమున లోహబద్ధములైన కాలుసేతులతో నాంధ్రచక్రవర్తియగు శ్రీముఖుఁడు పడి యుండెను. గంగవైపున నిర్మింపఁబడిన లోహస్తంభపరిరక్షిత మగు చిన్నగవాక్షమునుండి యాకారాగారము నందలి యీ గదిలోనికి తేజోవాయువులు ప్రవేశించుచుండెను. శ్రీముఖ చక్రవర్తి నేలఁబోలుచు నెమ్మదిగా నా గవాక్షమును జేరి యందుండి తనకు దిగువను రెండు నిలువుల క్రిందుగా నున్న గంగా జలోపరిభాగమును వీక్షించుచుఁ గూరుచుండెను. నిర్మలమైన చంద్రకాంతి యప్పుడే యానీటఁబడి శ్రీముఖుని ముఖము మీఁదికిఁ బ్రతిఫలించుచుండెను. కుబేరపురమువలె శంఖమకరకచ్ఛపాది పరిపూర్ణంబైన యామందాకినినివీక్షించి శ్రీముఖుఁ డిట్లు తలంచెను. "అమరావతి యందలి కామ ధేనువునకును గల్ప భూజములకును నమృతము లొసఁగి రక్షించు నీమందాకినీ నదిని జూచి నేను తరించితిని. మహా దేవునిశిరమున నెలకొని యందుండి సగరపుత్రులకు గతులు గల్గించుటకై భూమి కరుదెంచిన యీపవిత్ర గంగా భవాని నుండి తుంపురులు నాపైఁబడి నాసకలపాపములను క్షయింపఁ జేసినవి. ఇంకనాకు పాపవిముక్తియైనది. ముక్తుఁడనైన నన్నీ లోహబంధములు ఇంకను బాధింపగలవా? ఓ భవునిరాణీ! కల్యాణీ! నిన్నుఁ జూడఁగంటిని. నాపాపములఁ బాయఁ గంటిని. నామనఃకోశమునం దఖిల సౌఖ్యపదవుల. నందఁ

గంటిని. ఇదేమంటిని. హృదయరంగమునం దానందతరంగిణీ ప్రవాహములు పొంగి పొరలి సమస్తావయవముల నుండియు బయలు వెడలు నప్పుడు కారాగృహమే స్వర్గతుల్యము. ఇఁక నాకు బంధములు లేవు. తల్లీ! నీనామమునే స్మరించుచు ఈ ప్రదేశమునందు నేను నర్తనము చేయుదును.” స్థూల కాయుఁ డయ్యును చిరకాలమునుండియు నిద్రాహారములు లేమిచే కృశించి కృశించి శల్యమువలె నున్న శ్రీముఖునికి గంగాప్రవాహ నిర్గతములైన శీతల శీకరములా రేయిని స్పర్శానందకరముగా సోఁకఁగానే దేహతాపములు చల్లారెను. ఘోరపాపాగ్నులను సహితము చల్లార్చు శంభు నిల్లాలికి శ్రీముఖ దేహతాపోపశమనము ఎంతపాటిది? స్త్రీలచేతులకు బలవంతముగా గాజులనెక్కించు గాజులవాని పోలికను దల క్రిందువలచుచు రాజేంద్రుఁడు కృశించిన తనచేతి యినుప కంకణములను క్షణకాలములో నూడ్చివైచెను. కాళ్ళనుండి గొలుసులును నట్లే వీడివచ్చెను. రాజేంద్రునిధైర్యము హెచ్చెను. ఉత్సాహ మినుమడించెను. “ఈ గవాక్షమును తెఱచుకొని క్రిందికి దుమికితినేని తిన్నగా సమస్తసుభదాయిని యగు గంగామాయినిం బడుదును. గవాక్షము తెఱచుట యెట్లో? నాలుగువైపులను రంధ్రము లమర్చిన యినుపకమ్ము లను బెట్టి వానిలో నినుప యూచలను దాఁపినారు. గోడ లన్నియు కఠినశిలామయములు. ఏమిరా! బుద్ధిమంతులను జయించుటకు నహితము బుద్ధియే సాధనము. అట్టియెడ జడ స్వరూపమగు నీజాతిని ఈ యినుమును నేను జయింప

లేనా !" శ్రీముఖుఁడాగవాక్షము క్రిందను మీఁదను గోడలను పరీక్షించెను. ఒకచోట సున్నములోఁ బొదుగఁబడిన చిన్నఱాయి యొక్కటి కానవచ్చెను. "సరి సరి ! ప్రతిదినమును రాత్రిలయందు నిర్భయముగా నేను పనిచేయవచ్చును. ఎంతెంత పెద్దఱాళ్లైనను సున్నమువలననే అతుకుచున్నవి. పగటిపూట కాలుసేతుల కినుపకంకణములు ధరించుకొని కూరుచుండి రాత్రులయందీ కంకణములతోనే అతుకు సున్నములను గీకివైచి యొక్కొక ఱాతినే విడఁదీయవచ్చును. ఇట్లు గోడమందమునంతను నొకచోట ఛేదించితినేని గంగలో దుముకుటకు వివరమొకటి నాకు సిద్ధించును. ఇప్పుడీ గవాక్షములోని చిన్నఱాతిని నేనూడఁదీయుదును గాక."

అప్పటికాగోడ నిర్మింపఁబడి వేయివత్సరములయ్యెను. ఎండకును గాలికిని చెమ్మకును గుఱియై యుప్పటికి యాగోడ దిటవు చెడియుండెను. తనచేతి కంకణముతో శ్రీముఖుఁడా చిన్నరాతి చుట్టునుండు సున్నమును బది పండ్రెండుసారులు ఛేదింపఁగానే పైనుండి యింత సున్నపుపొడి నేలరాలెను. ఉత్సాహాతిశయముతో శ్రీముఖుఁడు మఱల మఱల ప్రయత్నములు సలిపెను. చిన్నఱాయి యూడి నేలఁబడెను. తోడనే యా ఱాతి దిగువ నున్న యినుపయూచయుఁ గదలెను. కొంచెము బలముతో నా యూచను బైకెత్తఁగానే యది పునాదినుండి వెడలి మున్ను ఱాయి తొలఁగినంత దాఁకఁ బైకిలేచెను. వెంటనే యా యూచ నీవలకులాగి వైచి, శ్రీము

ఖుఁడా సందులోఁ దన తలను దూర్చిచూచెను. శరీరమును నావలకు వెడలెను. "గంగాభవానీ! ఇది నీ మహిమ. ఇప్పుడింకను జాము రాత్రికాలేదు. ఈ గొలుసులను గంగలోఁ బాఱవైచితినా సుశర్మ నాజాడను శీఘ్రముగా దెలియలేడు. గొలుసులతోనే శ్రీముఖుఁడు చెఱవెడలినాఁడని నాశత్రువు లూహింతురుగాక."

శ్రీముఖుఁడు ఆ గొలుసులను గంగలోఁ బాఱవైచెను. గవాక్షములోని మట్టినంతను గంగలోఁ ద్రోచెను. తాను గవాక్షమునుండి బైటికివచ్చి, విడఁదీసిన యినుపకమ్మినియథాప్రకారముగాఁ దగిలించి పెకలించిన ఱాతిని మఱల పూర్వస్థానమునం దుంచెను. "నేనేదారిని వెలువడితినో యెవ్వరును దెలియలేరు. ఓ గంగాభవానీ! ఇదె నన్ను నీ పొట్టనుబెట్టుకొని సురక్షితముగా నావలకుఁ గొనిపోయి దరిజేర్పుము. మోసముతో నన్నుఁ బట్టిన సుశర్మను మోసము వలననే జయింపవలెను."

శ్రీముఖుఁడు గంగాప్రవాహములోనికి దుమికెను.

—0—

# నాలుగవ ప్రకరణము.



శ్రీముఖుఁడు కారాగారమునుండి బయలువెడలిన యొక గడియసేపఁటికి గుమిగాఁజేర్చి కట్టఁబడిన వెదురువాసముల తెప్ప నొకదాని నెక్కి తెడ్లతో దానినిఁ ద్రోసికొనుచు గంగాప్రవాహనఁబడి యిద్దఱు మనుష్యులు కారాగృహపు గవాక్షముల ప్రక్కకు వచ్చిరి. ఒక యినుపయూచయు, కొన్ని మైనపుగుడ్డలును, కొన్ని త్రాళ్ళును, రెండు ఉడుములును చెకుముకియు మాత్రమే వారికడ నున్న పరికరములు. కారాగృహముకడ వీరు తమ తెప్పను ఆపికొని తమలో తామిట్లు సంభాషించుకొనిరి. "శ్రీముఖుని యుంగరము మిక్కిలి విలువయైన రత్నములు కలది. అది యింకను నాతనికడనున్నదో లేక సుశర్మ కొనిపోయినాఁడో?" "లేదు లేదు. అది ఆంధ్రచక్రవర్తి ముద్రికయన్న మాటకాని దానివిలువ సుశర్మకొక లెక్కలేదు. కారాబద్ధుఁడైన శ్రీముఖుని యుంగరము సుశర్మకు ఎందుకును బనికిరాదు. ఆశిఖ యిప్పు డెవరికేమి ప్రయోజనము?" "మాటలవలన మనమిప్పుడు కాలహరణము చేయరాదు. రక్షకభటులీ దారిని మరలవచ్చిరేని మనపని జరుగదు. విసరు! ఉడుమును ఈమధ్య గవాక్షము మీఁదికి విసరు. అదియే కారాగృహములోని గదులలో అభేద్యమైనదిగాఁ దోఁచుచున్నది. అందే సుశర్మ శ్రీముఖుని

బంధించి యుండును. " ఉడుము గవాక్షమునినుపయూచలను గట్టిగాఁ బట్టుకొనెను. ఉడుము కాలికిఁ గట్టిన త్రాఁటితోనీ యిరువురును బైకెగఁబ్రాకిరి. గుగ్గిలపు గుడ్డలను చెకుముకితో వెలిఁగించి యాగదినిఁ బరీక్షించిరి. అందు శ్రీముఖుఁడు కానరాలేదు. " ఇందులేఁడు మఱియొక గదినిఁజూతము." ఆ వైపు గదులన్నియు నట్లే గవాక్షములనుండి పరీక్షింపఁ బడెను. ఒక్కదానిలోను శ్రీముఖుఁడు కానరాలేదు."

"మంత్రీంద్రా ? భట్టబాణా! బుద్ధిమదగ్రగణ్యులగు మిమ్ము సహితము సుశర్మ హతకుఁడు జయించినట్లు కానవచ్చుచున్నది. మనరాక యెఱిఁగి మనచక్రవర్తి నీదినముననే మాగధుఁడు స్థలము మాఱ్పించి యుంచి యుండవచ్చును. ఇప్పు డేమిచేయుదము! "

భట్ట :— ఆపస్తంబా ! మన రాజేంద్రుఁడు చెఱవదలి వచ్చినాఁడు. సుశర్మ బంధములు మనరాజేంద్రునికొక లెక్కయా? పిశునుని మంత్రాను సారముగా పోవువారిని జయించుట కష్టమా. పిశునోశాన పరాశర విశాలాక్ష భారద్వాజాది రాజనీతిజ్ఞుల మించినవాఁడు చాణక్యమంత్రి. అట్టి చాణక్యుని యర్థ సంప్రదాయముల నుగ్గుపాలుగా సేవించిన మన శ్రీముఖ సార్వభౌమునికి తెలియని నీతిమార్గములు లేవు. ఈ యిటుకల పొంకమును నా యూచల బింకమును జూడుము. రాజేంద్రుఁడీ గవాక్షపు టూచలను బెకలించి యిప్పుడే నీట దుమికినాఁడు.

బుద్ధివలనఁ దెలియరాని యర్థము లీలోకములో నుం డునా? ఆపస్తంబుఁడు అచ్చెరువుతోఁ నా గవాక్షమును పరీ క్షించి "ఏమి మన రాజేం దుని యూహాపటిమ! నేఁటి యుద యమునకు రాజీ యఱయందే యుండెననుటకు సుశర్మ హత కుని సభలోని వృత్తాంతములే సాక్ష్యములు. పొద్దు మాటు మణఁగిన తరువాతఁగాని సార్వభౌముఁడీ గదినుండి వెలువడఁ జాలఁడు. కాఁబట్టి యిప్పుడిప్పుడే రాజేంద్రుఁడు నీట దుమి కెనని యీ యూచలు మనకు చెప్పుచున్నవి. బుద్ధిబలము కల వాఁడు జడపదార్థములను గూడ పలికింపఁ గలఁడు గదా! భట్ట బాణా? ఏమి నీ బుద్ధి విశేషము.

భట్ట :—రాజు విషయమై మన మిప్పుడు తొందర పడవలసిన పనిలేదు. రాజు తప్పించుకొన్నవార్త యింకను నీ కారా గార పరీక్షకులకు దెలియ దనుటకు మన మీ గవాక్షము పై కెక్కి శోధింపఁ గలుగుటయే నిదర్శనము. అదె ఆ మూలనుండి దీపపు వెలుఁ గిటువంకకు వ్యాపించుచున్నది. శీఘ్రముగా క్రిందికి దిగు. రాజేంద్రున కింతలో నేయాపద యుఁ గలుగదు. నాకది తెలియును. ఒక్కసారి పట్టణము లోని కరిగి వేఁగు జూతమురా.

ఆపస్తంబ భట్టబాణు లిరువురును నటువాసి పాటలీ పుత్రములోని కరిగిరి. అందు వేగుఁ జూచుచున్న తమ మను ష్యులనుగూడఁ గాంచిరి.

" ఈ గుంపులోఁజేరి మన వేఁగులవాం డ్రెట్లు విషయములను సేకరించుచున్నారో చూడు. బుద్ధసన్న్యాసుల వేషము తాల్చి కొందఱును, వర్తకులమని పేరుగాంచి తిరుగుచుఁ గొందఱును, మనతోఁ గపట విరోధమును నటించుచు నీ రాజునండఁజేరి కొందఱును, ఉభయ వేతనులై కొందఱును, మణిమంత్రౌషధ రహస్యముల నెఱిఁగిన వైద్యులమని కొందఱును మనపక్షమువా రెన్నెన్ని మాఱువేసములనో ధరించి సుశర్మ పురమునను, నాతని మంటపములోను ఎట్లు నిరాఘాటముగా వర్తించుచున్నారో చూడు. సుశర్మహాతకుఁడు మనకుఁ దెలియని మంత్రాలోచనము నెద్దానినిఁ జేయలేఁడు."

మంత్రమనఁగా నుపాయము. ఓం, హ్రీం, శ్రీం, క్లీం, గ్లాం, గం మున్నగు నక్షరముల యుచ్చారణము మంత్రము గాదు. ఈయక్షరములు జనులను భ్రమగొల్పి వారిని తప్పు మార్గమునఁ ద్రిప్పు భేషజతంత్రములు. నిజమైన యుపాయ మెవ్వనియందు గలఁదో వాఁడే మంత్రి. బుద్ధిబలమే మంత్రికి ప్రధానబలము. ఇట్లు మంత్రోపాయ చతురులైన యాపస్తంబ భట్టబాణు లిరువురును శీఘ్రగతిని సుశర్మ చక్రవర్తి సంకేత మంటపమును డాసిరి. అప్పటికప్పుడే ఆ మండపము చుట్టును గుంపులు గుంపులుగా ప్రజలుచేరియుండిరి. ఆయపర రాత్రియం దాసంకేత మంటపముననే రాజు నిజమంత్రి దండనాథాదులతో రహస్యా లోచనము చేయుచుండెను. పాటలీపుత్రమునుండి జనులు పాఱిపోకుండుటకై నగరివాఁకిళ్లన్నియు మూయఁబడి యుండెను. రాజసైన్యములు కొన్ని పురివెడలి

పరిసర ప్రదేశముల నన్నింటిని వెదకుచుండెను. పట్టణమునం దలి రాచనగరు లందెల్ల దుందుభిధ్వానములు వినవచ్చుచుం డెను. "శ్రీముఖహంతకుఁడు పాఱిపోయినాఁడు. వానినిఁబట్టి తెచ్చువానికి బహు సన్మానము లొదవున"ని రాజభటులు భేరిని మ్రోఁగించుచు పురమునందెల్ల సాటించుచుండిరి. సంకేత మంటపముకడ ప్రతినిమేషమునకును జనులగుంపు హెచ్చు చుండెను. ఆపస్తంబ భట్టబాణులు మాఱువేసములతో నీ గుంపులోఁ జేరి యిట్లనుకొనిరి. "మనరాజు సురక్షితుఁడై యున్నాఁడు. మనము కారాగారము చేరుటకు ముందే యా మహనీయుఁడు వెలువడినాఁడు. కాఁబట్టి మనమిప్పుడాయనను జేరి ముందు జరుపవలసిన దానిని విమర్శించుట కర్తవ్యము. ఈ సమయమున నిండు పేరోలగమున్న వేళ సుశర్మను మన ముహింసింపలేము. కొంత సేఁపీగుంపులోతిరిగియిచ్చటివృత్తాం తములను సేకరించుకొని మఱియు పోవుదుముగాక!" ఆప స్తంబభట్ట బాణులిరువురును నొక గుంపులోఁ జొరఁబడిరి. అచ్చట ఈక్రింది సంభాషణము జరుగుచుండెను.

ఒకఁడు :—"జాముర్రాత్రియై యుండును. అప్పుడు తెప్ప నెక్కి కావలి కాచువాఁడు కారాగృహము పార్శ్వమున గస్తు తిరుగుచుండెనఁట. అప్పుడు దూరమున నెవ్వరో నీటిలోనికి దుమికినట్లు శబ్దము వినవచ్చినది."

ఇంకొకఁడు:—"అప్పుడే జాముకోఁడి కూసినదఁట. వెన్నెలలో శ్రీముఖుని యాకారమువంటి యాకారమునే కావలివాఁడు చూచినాఁడట."

మఱియొకఁడు :—రాజున్న గవాక్షము నుండియే! బక్కచిక్కిన వాఁడు, స్ఫురద్రూపి, ఎఱ్ఱనివాఁడు, పొడుగైన కాయమువాఁడు, నీట మునిఁగినాఁడు, ఎంత వెదకినను మఱల కానరాలేదు. ”

ఆపస్తంబ భట్టబాణు లిట్లనుకొనిరి. “ ఈ లక్షణము లనుబట్టి యాతఁడే చక్రవర్తి. కాని మనము చూచునప్పటికి గవాక్షములన్నియు నభేద్యములుగానే యున్నవి. రాజీదారిని వెడలెనని వీరెఱుఁగలేరు. ” వీరు ఆగుంపులో మఱియొక చోటికిఁ బోయిరి.

“ గంగా ప్రవాహములో పుట్టి నెక్కివచ్చువారు కారా గృహపు గవాక్షములలో కాంతినిఁ జూచినారు. అప్పు డొక మనుష్యుఁ డొకగవాక్షమునుండి మఱియొక గవాక్షము లోనికిఁ బోవుచుండెను. ”

ఆప :—(రహస్యముగా భట్టబాణునితో) ఇదిమనమే! ఔరా! మనమెంత దైవికముగా తప్పించుకొంటిమి. కావలికాఁచు వాఁడు వెడలిపోవుదాఁక మన మాటెల్లు దుబ్బుమాటున నున్నందున నీప్రమాదము తప్పినది. రాజుదుమికిన యఱ ఘడియ సేఁపటికి మనమచ్చటికిఁ బోయి యుందుము. ”

వీ రిరువురును మఱియొక గుంపులోనికిఁబోయిరి. ”

“ నిశ్చయముగా భట్టబాణుఁడే రాజును తప్పించి నాఁడు. భట్టబాణుఁడు చాణక్యునికంటెను నెక్కువవాఁడఁట.”

"వాని తెలివిని నీవు చూడలేదా? ఏవో నాలుగు బొంకులుబొంకి సుశర్మ చక్రవర్తి యంతటి వానిని సహితము ఏమఱించి నేటికా యాంధ్రహతకుని ప్రాణములు కాపాడినాఁడు."

"ఔను! వాఁడే శ్రీముఖుని తప్పించినాఁడు. ఇందుకు సందేహములేదు. భట్టబాణుని మంత్రమేకానిచో తలుపులు గవాక్షములు చెక్కుచెదరక యుండఁగా లోనిరా జెట్లుమాయము కాఁగలఁడు? మునిఁగినవాఁడు తేలకుండ కావలివాని నెట్లు తప్పించుకొనఁగలఁడు! ఓభట్టబాణా! మంత్రమన్న నీదేమంత్రము. కావలివాని కండ్లముందర రాజునెత్తుకొని పోయిన నీవే మంత్రివి!"

భట్టబాణుఁడు ఆలకించి తనలో తానే నవ్వుకొనెను. ఏమి యీపిచ్చి ప్రపంచము! మంత్రమనుకొనుఁడు! మనుష్యుని సమర్థత యనుకొనుఁడు. ఈశ్వరుని పక్షపాత బుద్ధి యనుకొనుఁడు. భట్టబాణుని నెఱుఁగమిచే శత్రువు లాతనికిప్పుడు తగని గౌరవము నిచ్చుచుండిరి.

ఇంకొక గుంపులోనికి వీరిరువురును నరిగిరి. ఒక రాజభటుఁ డిట్లనుచుండెను. "దుర్మార్గుఁడు! పాఱిపోయినాఁడు! ఈ గుంపులోనేచేరి విషయములను సేకరించుచుండును. పురజనులారా! భట్టబాణుని బట్టిన పదివేల నిష్కములు బహుమానము. ఇదిగోవానిరూపము." ఒకదివ్వెయెదుట నెల్లరును భట్టబాణుని చిత్రరూపమును గాంచిరి. భట్టబాణుఁడా రాజభటుని సమీపించెను.

"ఓరీ! భట్టబాణుఁ డెవ్వఁడు? ఎన్నో మాఱు వేసములతో నాంధ్రులిప్పుడు చరించుచున్నారు. వానినిఁ బట్టుటకు సులభోపాయ మెద్ది?" రాజభటుఁడు బాణునివంక నిదానించి చూచెను. "అయ్యా! ఏమనుచున్నారు? భట్టబాణుఁ డెవ్వడనియా? వాఁడు కృత్రిముఁడు. మాయలమారి. ఇంద్రజాల మహేంద్రజాలముల నెఱిఁగినవాఁడు. శ్రీముఖునిమంత్రి. యోధాగ్రేసరుఁడు మాదండనాథుని సహితము కనుమలిపి ఏడుప్రాకారములందలి భటులను దప్పించుకొని నేటిరాత్రి మాయమై పోయినవాఁడు."

భట్టబాణుఁ డిట్లనియె. "ఇది నాప్రశ్నమున కుత్తరముగాదు. మాయలమారి యని చెప్పుట మనుష్యుని యానవాళ్ళను దెలుపుటగాదు. వాని నెచ్చోటఁ బట్టవచ్చును?"

"ఆంధ్ర గృహములయందు, బుద్ధసన్యాసుల యందు. వాని వీఁపుమీద రెండువేళ్ళ వెడల్పును నాలుగంగుళముల పొడుగునుగల రోమపూరితమైన పుట్టుమచ్చ యొకటి యున్నది.

భట్టబాణుఁడు మనస్సులో నవ్వుకొనెను. "నావీపు మీఁది యిూరంగును ఎప్పుడో తుడిచివేసితిని." "మిత్రమా! సరి సరి! ఇంక నీవుపో" రాజభటుఁడు వెడలిపోయెను.

ఆపస్తంబ భట్టబాణు లిట్లాలోచించుకొనిరి.

"మన వేఁగులవాండ్రు మనకుఁ జూపిన సంజ్ఞలవలన సార్వభౌమునికి గావలిగాయుచున్న మన యాంతరంగిక భటులు ఆయనను రక్షించుటకై తత్సమీపమున నేయున్నారు.

శ్రీముఖుఁడీ పట్టణములోనికి వచ్చిన వార్త లెందును గాన రావు. కాని యొక వనితాలలామ నీసుశర్మ హంతకుఁడు నేఁటి రాత్రమున నీ పురికిఁ దెప్పించినట్లు పొడఁగట్టుచున్నది. ఆ సంగతినిఁగూడ విచారింతమురా."

ఆప:— రాజేంద్రుఁడిప్పు డెచ్చోటనుండి యుండును? గంగా ప్రవాహమును శత్రుభటులు సహస్ర సంఖ్యలుగా గాలించుచున్న యీ సమయములో రాజేంద్రుని కెట్టి విపత్తును సంఘటింపదు గదా?

భట్ట:— రాజు వెడలిన యల్పకాలమునకే మనము గవాక్షముపై కెగఁబ్రాకినందున, నాతడు మనలను జూచియే యుండును. దానినిబట్టి తన కెట్టిసౌకర్యము లొడఁగూర్పబడినవో యాతనికిఁ దెలిసియే యుండును. మంత్రోపాయధురీణుఁడయిన యా మహనీయుని కెట్టి యాపదయురాదు. మన మా సుందరాంగి సమాచారము నరసివత్తమురా!

ఆపస్తంబుఁడును భట్టబాణుఁడును గంగానది వంక కరుగుచుండిరి. గంగాతీరమంతయు రాజభటులతో నిండి యుండెను. గంగనుండి నలుదిక్కులకును రాజభటులతో నిండిన తెప్పలు పోవుచుండెను. మార్గమధ్యమున నొక గుంపులో నీక్రింది సంభాషణము జరుగుచుండెను.

"రెండు శవములును జిక్కినవా"

"లేదు. మొండెములు మాత్రమచ్చట నున్నవి. శిరస్సులు కానరావు."

"అట్లయిన వారే! వారే! భట్టబాణుఁడే! భట్టబా

ణుఁడే! దురాత్ముఁడు! దురాత్ముఁడు! ఇంతకును చేతికిఁజిక్కిన కనకవల్లి తప్పించుకొన్నది."

మనరాజు దురదృష్ట మట్టిదే! ఎన్నినాళ్ళ నుండియో రాజామెమీఁద తనకన్నుపెట్టి యుంచినాఁడు. నేఁటికి సిద్ధాన్నము పడిపోయినది.

భట్టబాణుఁ డచ్చటనే నిలిచెను.

" ఔరా! ఈ భట్టబాణుఁడు కాలాంతకునివలె నున్నాఁడు. ఆవల దండనాథుని కన్నుఁగప్పి, యీవల ఆంధ్రుని విడిపించి, యిటుప్రక్క యుద్ధకారణమైన మన కనకవల్లిని కాపాడినాఁడు. వీనినిఁ బట్టుటకు బ్రహ్మకును తరముగాదు."

"దారుకుని కత్తితోడనే, ఆంధ్రునకు కత్తిగూడ లేదు. తడిబట్టలఁట! కాళ్ళకు ముఖమునకు బురదయఁట! తలయు గడ్డమును పెరిగియున్నవఁట. వెనుకపాటుననే వచ్చి దారకుని చేతికత్తి లాగుకొని తక్కిన యిద్దఱిని తెగనఱికి నాఁడఁట! మనవాండ్రు కనకవల్లి నచ్చటనే వదలి పారిపోయి నారు. అఱపులవలన గుంపుచేరునప్పటి కక్కడ కనకవల్లియు లేదు, భట్టబాణుఁడును లేఁడు. ఎంత వెదకినను గాన రారు."

"ఆహా ప్రమాదము వచ్చినది" అని యాపస్తంబుని చెవిలో నేదియో పలుకుచు భట్టబాణుఁ డాతనితో మఱియొక చోటికిఁ బోయెను.

"చక్రవర్తి యీ యూరనే యున్నాడు! మనకై వెదకుచు నిటువచ్చి సుశర్మపాలఁబడ నున్న యొకకన్యకను గాపాడినాఁడు. పెరిగిన తలయు గడ్డమును చక్రివర్తి యీ యూరనే యున్నాఁడని శత్రువునకుఁ జాటుచున్నవి. పదపద. ముందు మన చక్రవర్తినిఁ గాపాడవలెను." "నే నెఱుఁగుదును. నే నెఱుఁగుదును. ఈ దారినే! ఈ దారినే! ఇంతకు సమీపములోనే సమీపములోనే. అదిగో ఆ రేవుననే మనము దిగినాము. ఈ దారినే చక్రివర్తియు వచ్చినాఁడు. ఈ వీధి సమీపములో అదిగో! ఆ మనుష్యులు చేరియున్న తావుననే హత్యజరిగినది. ఈ సందులోనే చక్రివర్తి ప్రవేశించినాఁడు. ఇందుండి యీ సందులోనికి మఱలినాఁడు. ఇచ్చటనుండి యీ మలుపు తిరిగినాఁడు. ఇదిగో! ఆతోఁటలోఁ జేరినాఁడు. ఈ పాడుగుడి చొచ్చినాఁడు. ఈ సొరంగముచేరి యిట్లే ఱాతిని మఱల మూసినాఁడు. (కొంతదూరమరిగి) అక్కటా! నాకు ఊపిరి యాఁడకున్నది. పూర్వము లాక్షాగృహదహన సమయమున పాండవులిట్లే తప్పించుకొన్నారు. రా! రా! అదే తలుపు." సంకేత ప్రకారము భట్టబాణుఁడు తలుపుతట్టెను. లోనుండి శ్రీముఖ చక్రవర్తితలుపు తెఱచెను.

"సమస్తలోక పరిపాలనాధురీణా! శ్రీముఖ సార్వభౌమా? ఇదే భట్టబాణుఁడును ఆపస్తంబుఁడును వలికనాశీర్వదించుచున్నారు."

ఖడ్గపాణియై చక్రవర్తి చెకుముకిని వెలిఁగించెను. వా రిరువురకు సాష్టాంగ మొనర్చెను. వారు ఉచితాసనాసీనులైరి. "సార్వభౌమా! దుష్టుఁడైన సుశర్మచేతినుండి ఇప్పటికి తెప్పిరిల్లితిమి? కానున్నదంతయు ముందే యున్నది. ఏలికకు జయమాగాత!" "రాజ్యము మంత్రప్రధానము. మంత్రమువలన గెలువగూడని దెద్దియు లేదు." అని యాపస్తంబుఁడు పలికెను.

-0-

# ఐదవ ప్రకరణము.



హా! జగద్రక్షకా! జగన్నాథా! దీనదయాళూ! స్వామీ! నేను నీకేమి యెగ్గొనర్చితిని? పాలవంటి యుత్తమ కులమున బుట్టించి నన్నీగతినిఁ ద్రోయుట నీకు ధర్మమేనా? బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడై యపరజనకుఁడైన జనకరాజర్షికి పెరిమంపు బిడ్డనై యల్లారుముద్దుగాఁ బెరిగి సాటిలేని రూపరేఖా విలాసాదులచే త్రిభువన ఖ్యాతిఁగాంచి మించిన హృదయాధినాథుఁడగు శ్రీముఖచక్రవర్తి ననుగమించు భాగ్యమునకై నిత్యతపము లాచరించుచు పడియున్న నాకీకష్టముల నేల తెచ్చిపెట్టితివి? కనకవలీ! కనకవల్లీ! ప్రజలందఱును నా రూపమును గాంచి నన్ను కనకవల్లి యని పిలుచుటచేతనే నాకీ యెగ్గు వాటిల్లినది. ఓరీ! క్రూరా! ఛండాలా! శైలూషాధమా! సుశర్మా! పౌండ్రకుఁడైన రాజర్షిసత్తముని నా తండ్రిని జనక మహారాజును సర్వదష్టునిఁ గావించి సంహరించి నన్నుఁ జెఱపెట్టి యింతటి దౌర్జన్యమున కొడిగట్టితివా! ఆ చెఱనుండి తప్పించుకొని అరణ్యముల నధిగమించి, మహా పర్వతములను లంఘించి, నదులను దరించి, వచ్చి వచ్చి హృదయాధినాథుఁడైన శ్రీముఖ చక్రవర్తిని నీచెఱనుండి వదలించి యాయన దయను సంపాదించుటకై యీపాటలీ పుత్రమును జేరఁబోవుచుండఁగా మార్గమధ్యమున మరల

నీవు నన్ను బంధించితివా? అక్కటా! తానొకటి తలఁచిన దైవమొకటి తలఁచును గదా. నాకీ పాపపు దైవ మేలొకో యిన్ని విఘాతములను గలిగించుచున్నాఁడు! ఇట్లా దురాత్ముల చేతులలోఁబడి యీయూరు చేరినతరువాత ననువిడిపించిన యాయాపద్బాంధవుఁ డెవ్వఁడో? ఆ పొడుగు గడ్డమువాఁడు, ఆ చింపిరితలవాఁడు, ఆకృశించిన దేహమువాఁడు, ఆయాజానుబాహుఁడు, ఆ యపరరాత్రములో నన్ను శత్రుహస్తములనుండి విడిపించిన శస్త్రవిద్యావిశారదుఁడు ఆమహానీయుఁడెవ్వఁడో కదా! అప్పటి కాతఁడు నన్నుఁగాపాడి యాకుటీరముచేర్చి కల్రశావ్యనినాదముతో తానువచ్చి రక్షించుదాఁక నందేయుండుమని ముదల యిచ్చి చనినాఁడు.ఆమహానుభావుఁడే చక్రవర్తి. ఆయనయే నానోము పంట. నా సౌఖ్యముల కాకరము. నాహృదయంపుఁ బెన్నిధానము. నా జీవితంపు జీవితము. అక్కటా! అందోళితమనస్కనై అంకురితములైన యనుమాన బీజముల నుక్కడించి చేతఁజిక్కిన సార్వభౌముని వెన్నంటిపోక యాకుటీరములో ఒంటిగా నుండుటకు నేనేల ఒప్పుకొంటిని. ఓ వెఱ్ఱి మానసమా! నీకిఁక శ్రీముఖ సార్వభౌముఁ డెక్కడ? తొలినోములు నోఁచిపుట్టని నావంటి మందభాగ్యకు లోకో త్తరచరిత్రుఁడైన సార్వభౌముని యర్ధాంగము సిద్ధించునా? సార్వభౌమా! కారాబద్ధుఁడ వగుటచే విరూపివయ్యును నీవే నాకంటికి నవమోహనా కారుఁడవుగాఁ గానవచ్చు చున్నావు. రాజమందిరములలో సఖీసహస్రములతో విహరించు నే నీరాత్రి యీచిమ్మచీఁకటిలో

ఈ పాడు గుడిసెయందు ఏకాకినై పరిభ్రమింపవలసి వచ్చి నదా? ఓ హృదయమా! నీవు చీఁకాకు చెందకుము. సార్వభౌముఁడు ముదల యిచ్చియుండఁగా నీకింత యాందోళన మెందుకు? అక్కటా మానవబుద్ధి యెంతచపలము. ఇం దుండి వెడలుటయా? ప్రాణనాథుని యాజ్ఞలను మీఱ వచ్చునా? బయటకెట కరుగుదును? ఈవిశాల పురవీథులలో నాకెవ్వరు దిక్కు? శత్రువులు నన్నెఱిఁగి ప్రాణనాథుఁడు లేని యీ సమయమున నీకుటీరమునఁ జేరినయెడల నేనేమి చేయుదును? ఏమీ భయమేమీ? ఈ చంద్రాయుధముతో వారిని సంహరించి మీఁదు మిక్కిలి వచ్చినయెడల నన్నుఁ గూడ—ఇంతకును ఆయన సార్వభౌముఁడేనా? మఱల నిటకు వచ్చునా? నన్ను మన్నించునా? ఆ చక్రవర్తికి నర్ధాంగ లక్ష్మినై మనుభాగ్యము నాకు లభించునా? ఆంధ్రరాజ్య రమాధురంధరుఁడైన చక్రవర్తికి పెరిమంపు టిల్లాలనై ఇంద్ర వైభవము లనుభవించుచు మహారాజ్ఞి బిరుదమున నున్నతిఁ గాంచి, ఆ పురుషోత్తము ననుభవించు భాగ్యము విరించి నాకు వ్రాసెనా? లోకోత్తరమైన గుణపుంజమును, గుణపుంజము నకు వన్నెదెచ్చు సద్విద్యయు, విద్యకు వాసినొసఁగు సార్వ భౌమత్వమును, సార్వభౌమత్వమునకు దీప్తినొసఁగు శృంగార మూర్తియుఁ గల యీ యవతారపురుషునిఁ జెట్టఁబట్టుభాగ్య మాబ్రహ్మయెవ్వతెకు వ్రాసెనో? హృదయమా చలింపకుము. అదె యెవ్వరియొక్కయో పదధ్వని వినవచ్చుచున్నది.

భట్టబాణుఁ డాకుటీరము కడకువచ్చెను. సంకేతప్రకారము తలుపు తట్టెను. లోన ప్రవేశించి తన్ను తెలుపుకొని యామె భయమును దీర్చెను. ఆమె యావద్వృత్తాంతములను నారసెను. జనకచక్రవర్తి యకాలమరణమునకు వగచెను. పాటలీపుత్రమునం దామెకు తోడెవ్వరును లేరని తెలిసికొని యామెను ఆంధ్రరాజ్యమునందు సురక్షితముగాఁ జేర్చు భారమును తనమీఁద పెట్టుకొనెను. సుశర్మపై పగఁదీర్చుకొందునని శపథము చేసెను. ఆమెను పురుషవేషమును ధరింపఁజేసెను. విమానారూఢుఁడై యామెతోఁగూడ నాకసమున కెగసెను. పాటలీ పుత్రమును దాఁటెను. మహారణ్యములను గ్రమించెను. అచ్చోట చీమలు దూఱని చిట్టడవియు కాకులుదూఱని కాఱడవియునగు ఘోరవిపిన మధ్యమున ఋష్యశృంగు నాశ్రమమున కనకవల్లిని విడియించి రాజకార్య ధురంధరుఁడై తాను పని వినియెను.

# ఆఱవ ప్రకరణము.



పాటలీ పుత్రమునందు సుశర్మ రహస్యాలోచనము లను జేయుటకై మంత్రి దండనాథాదులనుఁ బిలిపించికొలువు కూటములోఁ గూరుచుండెను. మంత్రియైన సుబుద్ధి ఆ సమయమున రాజుతో యుద్ధప్రక్రియలనుగూర్చి చెప్పుచుండెను.

"రాజేంద్రా! మాగధులు దిగ్విజయమును గాంచినారు. అమరావతీపట్టణము మన స్వాధీనమైనది. అందలి బౌద్ధస్తూపములందు బౌద్ధపరివ్రాజకులు సుఖముగా వాసము చేయుచున్నారు. శ్రీముఖుఁడు కట్టించిన స్తూపమునుండి అతని శాసనమును ఎత్తివేయించుటకు ఆజ్ఞ యొసఁగబడినది. ఆంధ్రులు అమరావతిని నిలుపుకొన్నయెడల అమరావతీ విద్యాస్థానములందు బౌద్ధశాస్త్రములు నశించుననియు, ఆపురము నందలి బౌద్ధస్తూపములు పడఁగొట్టఁ బడుననియు, దాక్షిణాత్య దేశములలో బౌద్ధమతము నశించిపోవుననియు నాగచక్రవర్తియగు వాసుకికి వర్తమాన మంపఁబడినది. అతఁడు మన రాయబారిని గౌరవించి ఏలినవారిని బుద్ధావతారులని ప్రశంసించి, తన సైన్యముల నన్నింటిని మన స్వాధీనమందుంచుటకును, సమయము వచ్చినయెడల తానుగూడ బౌద్ధ మత రక్షణార్థము నడుము కట్టుకొనివచ్చి దేవర యాజ్ఞలను శిరమున వహించుటకును నొప్పుకొన్నాఁడు. కురు సల పాంచా

లాది రాజసత్తముల కందఱకును, ఘోరమైన మత యుద్ధ మారంభ మయినదనియు, భరతవర్షములో బౌద్ధమతమున కిఁక మీఁద నిలువఁ దావున్నదో లేదో తేలవలసిన కాలము వచ్చినదనియు, ధర్మసంరక్షణార్థమై యెల్లరును యుద్ధమునకు సిద్ధపడియుండవలయు ననియు ఏలిక యాజ్ఞలను బంపించితిని. అంతయును మన కనుకూలముగానే యున్నది." అని చెప్పెను.

రాజేంద్రుఁడు ముదితుఁడై "సుబుద్ధీ! నీవంటిమంత్రి సత్తముఁడు నాకుండఁగా మనకు విజయముగాక పరాజయ మెన్నఁడైన కలుగునా? ఆంధ్రులకు రాజ్యమా పోయినది. సహాయము చేయువారా యెవ్వరును లేరు. వారు పూర్వాచార పరాయణులు, లోకమా బౌద్ధమయము. అన్ని దేశముల రాజులను మనము ముందుగా నరికట్టి యుంచినాము. ఇఁక నాలుగైదు దినములలో, నాయాసలకాకరమును ఈవైరములకుఁ గారణమును నగు కనకవల్లికూడ మనకు లభింపనున్నది. ఇంతకును ఆంధ్రుల బలాబలము లెట్లున్నవి?

సుబు:—ముందుగా శత్రురాజగు శ్రీముఖుని దెలిసినఁగదా తరువాత వానికిఁగల ప్రపత్తుల నెఱుఁగవలసి యుండును. శ్రీముఖుఁడు ఏలికవలెనే కార్యసాధకుఁడుగాని సామాన్య రాజులవలె మంత్రులచేతిలో సర్వస్వమును విడిచిపెట్టి నట విటగాయకాదులతో భోగ పరాయణుఁడై కాలము పుచ్చుచు, వారి యాజ్ఞానుసారముగా నున్నవారి యుద్యోగములను దీసివైచి, అయోగ్యులకు బహుమానములిచ్చి,

రాజ్యతంత్రములు నడపువాఁడు కాఁడు. ఏ కార్యమున
నెవరికి చిరకాలానుభవము కలదో తెలిసికొని, ఆకార్య
మున నట్టి వయోవృద్ధులగు పెక్కండ్రతో తఱచుగా
సంభాషణలు జరుపుచుండువాఁడు. ఆ సామాన్య సంభా
షణములలో లోకాభిరామాయణ మంతయు చర్చింపఁ
బడుచుండుటచే రాజు సంకల్పించుకొన్న యుద్యమము
చెప్పువారికిఁ గూడఁ దెలియరాదు. ఇట్లు నిరంతరమును
పెద్దలతో ముచ్చటలాడుచు, అందలి మంచి చెడ్డలను
తాను స్వతంత్రముగా విమర్శించుకొని, శ్రీముఖుఁడు
కార్య ధురీణుఁడగుచుండును. విమర్శనకు సహాయకారి
యగు నన్వీక్షకిని (LOCIC) పరిపాలనకు దారిచూపు వార్త
మునను, దండనీతిని శ్రీముఖునిఁ బోలఁగలవా రిప్పుడీ
భరతఖండములో నెవ్వరును లేరు. ఇట్లద్వితీయస్థానము
నాక్రమించిన యీ హాతకుఁడు ఇప్పటికిని అరుణోదయ
కాలమున గజతురగ స్యందనాస్త్ర శస్త్రాభ్యాసమునందును
అటుపిమ్మటఁ గొంతదనుక వృద్ధులగు పండితుల గోష్ఠిని
కడపి, మధ్యాహ్నకాలమున పురాణేతివృత్తాఖ్యాయి
కోదాహరణ ధర్మశాస్త్రార్థ శాస్త్రములను నితిహాస షష్ట
ముల విమర్శనమునందు వినియోగించును. సంభాషణల
వలనను, షడ్వైధేతిహాసములను వినుటవలనను, సంపాదించు
కొన్న శ్రుతమనఁబడు నీజ్ఞానమును, యోగమను పేరఁ
దనచర్యలయం దనుసంధానము చేసికొని క్రమక్రమముగా
నట్టినడత కలవాటుపడి శ్రీముఖుఁ డిప్పుడెట్టి సంకటముల

కును భీతుఁడుగాక, శాంతముతో కార్యము సాధింప నతి సమర్థుఁడై యున్నాఁడు. విద్యయనఁగా నిట్టి యనుభవ జ్ఞానమే. ఒక్క శ్రీముఖుఁడే కాదు. నాలుగు శతాబ్దుల నుండి ఆంధ్రు లెల్లఱును నమరావతీ విద్యాస్థానమున నిట్టి రీతి విద్యనే సంపాదించుకొని దానిని సమస్తకార్యముల కును సాధనముగా చేసికొన్నారు.

సుశ :—శ్రీముఖునిఁ గూర్చి నీవు చెప్పినదంతయు నిజమే. కాని యమరావతీ పట్టణ మిప్పుడు మనచేత చిక్కినది. వంచించి యాతని మంత్రిదండనాథాదులను మన వలలలో నై చికొనుటకు సాధ్యము కాదా ?

సుబు :—అదియును సాధ్యమగునది కాదు. వ్యవహారముల పట్ల శ్రీముఖుఁడు స్వతంత్రుఁడు గాని పరుల యభిప్రా యానుసారముగాఁ బోవువాఁడు గాఁడు. శ్రీముఖుని దూ తలు భరతవర్షమునందంతటను చరించుచు ఆంధ్రులకు సంబంధించిన విషయములలో నెక్కడ ఏచీమ చిటుక్కు మన్నను రెండవకంటివానికిఁ దెలియకుండ శ్రీముఖునికి జేర్చుచుందురు. ఆతఁడు ఇతరు లనేకులను ప్రచ్ఛన్న ముగా మరల మరలపంపి అవశ్యమేని మాఱువేసములతో తానుగూడ నరిగి "ఇదమిత్థ"మని యన్వీక్షకీ తత్త్వాను సారముగా విమర్శించుకొనిన పిమ్మటనే కార్యములకుఁ దొడఁగును. ఆతని మంత్రి పురోహిత దండనాథాదులు సహితమును నిత్యమును నిట్లు శోధింపఁబడుచునే యుం దురు. శ్రీముఖుఁడు ఏలికవలెనే కార్యసాధకుఁడు గాని,

రాజనామమును వహించిన తక్కిన వారివలె చెప్పుడు మాటలను విని తప్పులొనర్చువాఁడు కాఁడు.

సుశ :—నీవు చెప్పినది నిజమే. ఆతఁడు తనకడ నిడుకొన్న యంగవిద్యా చతురుల వలనను జంభక అంతరచక్రి సంస ర్గాది శాస్త్రప్రవీణుల వలనను మంత్రి పురోహిత దండ నాథాదులే గాక యువరాజును మండల కరగ్రాహకులును ప్రశాస్త్రిలును, వారిపై యధికారియగు సమాహర్త్రి యు, అక్షసన్నిధాత్రియు, ప్రదేష్ట్రియు, నాయకుఁడును, పౌరులును, వ్యావహారికులును, మంత్రి పరిషత్తును, అధ్య క్షుదండపాలురును గూడ నిరంతరము శోధింపఁబడుచుండు టను మన మెఱిఁగియే యున్నాము. ఇదిగాక ఆతని కొలు వులో పనిచేయు నల్పోద్యోగీయులు మొదలుకొని మంత్రి దండనాథులవఱకు గూడ నెల్లరును నుచితవంశ్యులై, సుగుణాభరణులై, యుక్తిచతురులై, ఉత్సాహపూరితు లై, రాష్ట్రాభివృద్ధి కెదురుచూచుచున్నారు. కామక్రోధా దులకు కారణములు కల్పించియు నాంధ్రులను జయించుట దుస్సాధ్యము. అయిననేమి? అమరావతి మనకుఁ జిక్కి నది. శ్రీముఖుఁడు రాజ్య పదభ్రష్టుడై మన పురమున ప్రచ్ఛన్నముగా నల్లాడు చున్నాఁడు. ఇప్పుడు మనకు కర్తవ్య మెయ్యది ?

సుబు :—రాజేంద్రా ! అదియే మన కిప్పుడు విచారణీయాం శము. ఆంధ్రులకు సహాయమొసఁగు వారిలో మొదటి వాఁడు కళింగ దేశపురాజు. అశోక చక్రవర్తి కాలము

నుండియు ఆంధ్రకళింగముల కత్యంత స్నేహము. కళింగా ధిపున కిప్పుడు ఎనుబది వేల మంది పదాతి వర్గములును, వేయు నేనుంగులును, పదివేలయశ్వములునుగలవు. వారం దఱును ఆంధ్రులకు సహాయులై నిలిచి పాటలీపుత్రమును ముట్టడింపఁగలవారు. వారిని రాకుండ నిలుపుటకై మన ము కళింగరాజ్యము మీఁదికి విశేష సైన్యముల నంపి మార్గనిరోధ మొనర్చి వారి ప్రధానపట్టణమగు కటకపుర మును సంరక్షించుకొనుటకు నెచ్చటెచ్చటి సైన్యములను రప్పించుకొనునట్లు చేయవలెను.

సుశ :—లెస్సగా నాలోచించితివి. దండనాథుఁ డిందులకుఁ దగిన సన్నాహముల నొనర్చును గాత !

దండ:—మహా ప్రసాదము.

సుబు !—ఆంధ్రులకు సహాయ మొనరించువారిలో రెండవ వారు దక్షిణ కోసలులు. వీరికి ఏఁబది వేల కాల్బలమును, ఎనమన్నూరు ఏనుంగులును, నైదు వేల గుఱ్ఱపుదళమును గలవు. వలయునేని వీరు అప్రయత్నముగా దమ బలమున కిబ్బడి బలమును కూర్చుకోఁ గలరు. ధాన్యకటకమును దక్షిణకోసలమును నొకదాని నొకటి యానుకొనియున్నవి. ఈయుభయులును జేరరేని వారిని జయించుటకు బ్రహ్మకు సహితము తరముగాదు. ఇవిగాక, చేదియు, విద ర్భయు, ఉజ్జయనియు, కొంకణమును నమరావతీ పురా ధీశ్వరుఁడగు శ్రీముఖుఁ డెట్లు ఆడించిన నట్లే ఇంకను ఆడుచున్నవి.

సుశ :—గజాశ్వాందోళి కాదులయందు మనబలమే మే పాటి శక్తి నిఁజూపఁ గలదు ?

దండ:—రాజేంద్రా! వినుము. చంద్రగుప్తునికాలము నాఁట నుండియు ఆంధ్రులు మగధరాజ్యమును జయింపవలెనని చూచుచున్నారు. అశ్వజాతులలో నుత్తమోత్తములగు కాంభోజ సింధ్వారట్టవనాయు దేశముల గుఱ్ఱములన్నియు నిన్నూరేండ్లనుండి యాంధ్ర రాజ్యములకే చేర్పఁబడి శాస్త్రానుగుణముగాఁ బెంపందింపఁబడు చున్నవి. బాహ్లిక పాపేయ సౌవీర త్రైతలదేశపు హయములు సామాన్య జాతికి జేరినవగుటచే వాని సంపాదముకొఱకు ఆంధ్రులు ప్రయత్నములు సలుపలేదు. అవియే మనకడనున్న హయ జాతులు. అయినను సాన్నహ్యాకర్మవలన మనగుఱ్ఱములు యుద్ధమునందు శత్రువుల వారువముల నవలీల జయింపఁ గలవు. బలాబలములనుగూర్చి దేవరవా రాలోచింపవల సిన పనిలేదు. జాతిగుఱ్ఱములు లేవన్నమాటతప్ప రథగజ పదాతులన్నిటిలోను ఆంధ్రులు మనకు సరిరాఁజాలరు.

సుశ :—మనకు సహాయమొనర్ప నంగీకరించినవా రెవ్వ రెవ్వరు ?

సుబు :—నాగ చక్రవర్తియగు వాసుకియు, కురుపాంచా లోత్తర కోసల దేశాధిపతులును, భరతవర్షములోని బౌద్ధ ధర్మానువర్తు లగు విశేష జనులును ఏలిక కను సన్నన మెలఁగి వర్తింపఁగలవారు.

సుశ :—కానుకలొసంగుచు వీరికి సముచితరీతిని రాయబారము లంపునది.

సుబు :—ఒక్క రాయబారముల నంపుటయే కాదు. తమ యాజ్ఞలన్నియు నెఱవేర్పఁ బడినవి.

సుశ :—చేది దేశముపైకి మన మంపిన సేన లేమైనవి?

సుబు :—చేదినాయకుని మీఁదికి పదివేల సైనికుల నంపి యాతని పురమును ముట్టడించితిమి గదా. మొన్న మన మంపిన యొక యక్షోహిణియు తిరిగి చేదిముఖముగా నడచుచుండెను. అదిచూచి భట్టబాణుఁడు చేదికి నాశము కలుగునని భయముచెంది అమరావతిలోని తన సేనల నన్నింటిని చేదిపురికంపెను. అప్పుడు మన యక్షోహిణి దారి మార్చుకొని అరక్షితముగానున్న యమరావతిమీఁద నాకస్మికముగాఁ బడి దానిని స్వాధీనము చేసికొన్నది. కటకము దారినిబట్టి పోవుచున్న మనసేనలు ఇంతలో మఱి యొక పుంతత్రొక్కి శత్రుసేనలను తిరిగి అమరావతికి రాకుండునట్లు నడుమచేరి మార్గనిరోధము కలిగించి భట్టబాణుని సేనలతో ఢీకొన్నవి. ఈలోపున విదర్భ పేరు చెప్పి మన మంపిన సేనలు చేదిపురిచేరి భట్టబాణుని సేనలను రెండవవైపునుండి యెదిరించినవి. ఉభయ సైన్యముల నడుమను చిక్కి ఆంధ్రసైన్యములు చక్కాడఁబడి చెల్లాచెదరై పాఱిపోయినవి. అటువెనుక విదర్భకును ఉజ్జయినికిని మనసేన లంపఁబడినవి. మన మిప్పుడు కటక

మునకును, దక్షిణ కోసలమునకును సేనల నంపవలసి యున్నది.

రాజేంద్రుఁడు ముదితుఁడయ్యెను. కావలసిన పనియంతయు నాయెను, ఆంధ్రుల కెవ్వరెవ్వరు సహాయము చేయఁగలరో వారెల్లరును పరాభూతులగు స్థితియం దుండిరి. సుశర్మ గంభీర వచనములతో దండనాథుని వీక్షించెను.

"దండనాథా! నీ సమర సన్నాహములు శత్రుమర్మ భేదకములు. మాగధుల కోపానలము కసవునుబోలు నాంధ్రరాజ్యములకు నిప్పుబెట్టి భస్మీపటలము కావించుచున్నది. మాగధుల శౌర్య కుఠారములు ఆంధ్రపక్షు కంఠ లుంఠనోదగ్రములై! ఉదయభానునిరీతి రక్తిమను గ్రక్కుచున్నవి. మాగధుల నిశితాసులు రణరంగమున ధళధళ మెఱయఁగానే యాంధ్రశత్రువులు విగతాసు లగుచున్నారు. పాటలీపుత్రము నందలి జనుల కన్ను లెఱ్ఱవాఱగా ఆంధ్రరాజ్యములందలి జనుల మొగములన్నియు తెలతెల పోవుచున్నవి. సైనికని కాయ హేతిచ్ఛటాచ్ఛాయలవలన గ్రీష్మాతప మొక్కటి యుదయించి పరవీర సైన్యములను శోషింపఁజేయుచున్నది. మాగధవీర విక్రమ విస్ఫులింగములు అరి సైన్యాటవులకుఁ గార్చిచ్చు వెట్టుచున్నవి. దండనాథా! ఇదియంతయు నీ యస్త్రవిద్యానిపుణతను లోకమునకు చెప్పక చెప్పుచున్నది. మంత్రీంద్రుఁడు చెప్పిన తక్కిన సన్నాహములను గూడఁ బూర్తి చేయింపుము.

దండ :—మహాప్రసాదము.

ఇంతలో ద్వారికుఁడు వచ్చి చక్రవర్తికి నమస్కరించి. "రాజేంద్రా! ఎవ్వఁడో బుద్ధశ్రమణకుఁ డొకఁడు రొజుచు పరుగెత్తుకొనివచ్చి ఏలినవారి దర్శనమును వేఁడుచున్నాఁడు. అమరావతినుండి వచ్చినాఁడట! రహస్యములైన లేఖలు తన కడఁగలవఁట. తమతోనే మాటలాడవలెనఁట!" అని చెప్పెను.

సుశర్మ:—ఇది రహస్యసభ. మా దర్శనము వానికి దొరకదు. ద్వారమున వేచియుండి మంత్రీంద్రుఁడు వచ్చిన వెనుక ఆయనతో మాటలాఁడుమని వానికి చెప్పుము.

ద్వా:—అట్లే చెప్పితిని. కాని తనపని అతి ముఖ్యమైనదనియు, తమకేగాని మనవిచేయరాదనియు, ఆతఁడనుచున్నాఁడు.

సుశర్మ:— ఏఁడీ ? ఆశ్రమణకుని ఇటు కొనిరా.

పరివ్రాజకుఁ డొక్కఁడు రాజసభలోఁ ప్రవేశించి రాజేంద్రునిఁ జూచెను. బోడితలయు, బోడిగడ్డమును, కాషాయ వస్త్రములును, కమండలమును, ఆతనిని సన్యాసి యని తెలుపుచునే యుండెను. సరస్వతీదేవి యాతని ముఖమునను, సాహస లక్ష్మి యాతనికన్నులను తాండవ మాఁడుచుండెనో యను రీతి ముఖవికాసముతో, నాతఁడు రాజేంద్రుని దిక్కు మొగమై నిలిచి "బుద్ధ ధర్మావతారుఁడగు సుశర్మ చక్రవర్తికి జయమగుఁగాక, అమరావతినుండి వచ్చిన బుద్ధసేవకుఁడు శాంతధర్ముఁడు ఏలిక నాశీర్వదించుచున్నాఁడు" అని పలికెను.

ఆ కంఠమునుండి వెడలిన సుస్వరమును వినఁగానే రాజేంద్రుఁడు అబ్బురవోయి నిలిచి నమస్కరించి, ఆతఁ డెవ్వఁడో బుద్ధి విశారదుఁడైన మహనీయుఁడని నిశ్చయించి కూరుచుండ నియోగించి "దేవా! తమవంటి యుత్తములు ఊరక రాజసభకు రారు. ఏ మహాకార్యము తమ్మీ సభ కాకర్షించి, మాకు తమ దర్శనలాభనమును గలిగించినది?" అని యడిగెను. "గొప్పకార్యమే కలదు," అని పలుకుచు శ్రమణకుఁడు మంత్రి దండనాథాదులవంకఁ జూచెను. "వారు మంత్రి దండనాథాదులు" తాము వారియెదుట యథేచ్ఛముగా మాటలాడవచ్చును." అని రాజు పలికెను! రాజేంద్రా! చెప్పుట కేమున్నది. ఇదె శ్రీముఖ చక్రవర్తి కుశల మడిగి తమ కీ యుపాయనముల నంపుచున్నాఁడు.

సుశర్మ:— శ్రీముఖుఁడా? ఆతఁడు చక్రవర్తియా?

శ్రమ:—ఊర్జితప్రణయ పూర్వకముగా శ్రీముఖుఁడు తమ కంపించు లేఖ యిదియే.

మంత్రీంద్రుఁ డాలేఖ నందుకొనెను. రాజాజ్ఞచే విస్ఫుటముగా దాని నిట్లు పైకి చదివెను:—

"స్వస్తిశ్రీ మదశేష మహీమండల మండనాయమానుండును, బుద్ధాగమ ప్రవర్తక ప్రధానుండును, నిఖిల రాజన్యమౌళి కిరీటరత్న దినకరప్రభా నీరాజిత నిజపాద పద్మండును, మగధరాజ్య రమావల్లభుండును నగు సుశర్మ సార్వభౌమునికి ఊర్జిత ప్రణయ పూర్వకముగా శ్రీముఖ రాజేంద్రుఁ డంపు వినయలేఖ.

సార్వభౌమా! చంద్రగుప్తుని కాలమునుండియు మీరును మేమును బాలును నీరునుంబలె నైక్యముం జెంది తగవులు లేక కలసిమెలసి వర్తించుచుంటిమి. కీర్తివిస్తారుఁడగు నశోకునకు మా యాంధ్రసైన్యము లెన్నిసారులో దిగ్విజయము జేకూర్చినవి. సర్వ సమయములను దమ మైత్రిని మెలఁగుచు మేము మీకు నోటిలోని నాలుకవలె, అక్షద్వయమువలె సమస్త కార్యములకు దోడునీడయై విలసిల్లుచుంటిమి. అట్టి మా యాంధ్రులయెడ నిష్కారణ వైరమూని ఏలిక పగసాధింపఁ బూనుచున్నారు. వైరము షట్ఛత్రువులలో నొక్కటి. భరతఖండము నేకచ్ఛత్రముగాఁ బాలించు దమబోంట్లు సామాన్యరాజులవలె మావంటి యల్పరాజ్యములతో సరిసమానముగాఁ బోరఁజూచుట యుచితముకాదు. అందును తమ మేలుకోరిన మావంటివారి నకారణముగా హింసించుట ఇహపరములకు రెంటికిని హానికరమైనది. సాహసవంతులకు శాంతమే భూషణము. తథాగతపథానువర్తులకు శాంతరహితమైన ధర్మము మర్మభేదకము. యుద్ధమునందలి జయాపజయములు వర్షాగమమువలె దైవికములుగాని ప్రయత్నసాధ్యములు కావు. సమరములు ప్రజామారణ హేతువులు. కీర్త్యున్నతుల కాశించి ఏ రాజేంద్రుఁడు సాధు సంతతులపై వైరమూని జననాశకమగు యుద్ధమునకుఁ బూనునో అట్టి రాజేంద్రునికి పాపము లొదవును. రాజనీతి విశేషములు తమకుఁ దెలియనివి కావు. ఏధర్మ రీతిని తమ్ము సంప్రీతునిఁ జేయఁగోరుదురో అట్టి రీతిని మేము దేవర ముదల నెఱవేర్చి

ప్రియము గొలుపఁగలవారము. తక్కిన విషయములు మా దూతయే తమకుఁ దెలుపఁగలవాఁడు."

ఆ యుత్తరమును విని సుశర్మ రూక్షవీక్షణుఁడై పరివ్రాజకుని వంకఁ జూచెను. పరివ్రాజకుఁడును సుశర్మదిక్కు మొగమై.

"దూత లెప్పుడును వార్తాహరులు, వార్తలు రసానుకారిణులు. అందలి యుచితానుచితములకు రాజులు బాధ్యులుగాని సందేశహరులు కారు. నిశిత కరవాలధారలకు చలింపక మెడయొగ్గి తన్నంపినవా రప్పఁజెప్పిన యక్షరములను నొప్పఁ జెప్పుటయే మావంటివారికి ధర్మము. దూత లెప్పుడును వధ్యులుగారు. సెలవేని మారాజు పేరుగా నాతఁడు చెప్పుమన్న మాటలను పలికెకు నివేదింతును."

ఆ సమయమునందు సుశర్మ రాజేంద్రుని హృదయమను రంగస్థలము నవరసములకును నర్తనస్థానమై యొక్క మహానాటకమువలెఁ జూపట్టెను. కోపమను దావాగ్నికి శ్రీముఖ నామోచ్చారణ మ్మాజ్యాహుతి యగుటయు నా రంగస్థలమున రౌద్రాగ్ని లాభీలజ్వాలా వారములై లేచి ముఖవిలాసము పేర రక్తజ్వాలలను, వీక్షణము లనుపేర విప్పుకలను ఉచ్ఛ్వాస నిశ్వాసము లనుపేర ఉష్ణములను దశదిశల వెదజల్లఁ జాలెను! పరివ్రాజకుఁ డా సమయమున తన యక్షములనుండి శాంతరసధారలను సంతత వృష్టిగా నాతని హృదయ రంగమున గురియించి రౌద్రాగ్నులను జల్లార్చి యాంధ్రులకు ముందురాఁబోవు విజయమును ధ్వనింపఁజేసెను. ఆంధ్రరాజ్య

రమను రాక్షస వివాహమునఁ బరిణయమగు బ్రియత్నమునఁ బుట్టిన శృంగార రసమును, నాంధ్రులు తనచేఁ బడనున్న పాట్లఁ దలఁపువలన నుత్పన్నమైన కరుణరసమును, సాహసమున తనవంటి సార్వభౌమునితోఁ బోరాడ నెంచిన శ్రీముఖుని యవజ్ఞతవలని హాస్యరసమును, జగదేక చక్రవర్తియై ముందుఁదా నాక్రమించు నున్నతస్థానమును దలఁచినమాత్రన బయలువెడలిన గర్వోద్భూతమగు నద్భుతరసమును, రణరంగమున శత్రుభయానకుఁడై నిలిచి యాంధ్రసైన్యములను భీభత్స మొనర్పఁజాలు నిజసేనా నివహముల భవిషచ్ఛర్యలవలన నుదయించిన భీభత్సభయానకరసములును నొక్కసారిగా సుశర్మ రాజేంద్రుని హృదయరంగమున చిందులు ద్రొక్కఁగా ముఖవికాసమువలన తనలోని రసములను వెలువరించుచు గొంతవడినిలిచి, యాతఁడు దూతతో "శ్రీముఖుని పేరుగా తాము చెప్పవలసిన దేమి ? యని యడిగెను. దూతయు యుద్ధమును మానుట కర్తవ్యమని రాజునకు నివేదించెను.

"పరివ్రాజకా ! తమ మోముకళజూడ నాకుఁ దమ యెడ గౌరవభావ మతిశయించుచున్నది. వేఱెవ్వరైన నీ సందేశముతో నాకడకు వచ్చినయెడల నీపాటి కాతని యమునిపాలి కంపించియుందును. అది యటుండనిండు శ్రీముఖుఁడు నాచేతఁబడి, దొంగతనముగా పాఱిపోయిన క్షత్రియయోధుఁడు. అట్టివానిని నిర్జించుట కష్టమని ఎవరెంత చెప్పినను నేను నమ్మను. శత్రుఁ డిట్టి భీరుఁడై యుండఁగా, అమరావతి

పట్టణము మాచేతఁబడఁగా, చేదినాయకుఁడు సంధిగోరు స్థితికి రాఁగా, మీకు సహాయమొనర్చు కటకాది రాజ్యములు మా సేనలచేఁ జుట్టఁబడి పరాభవము చెందుచుండఁగా, కురుపాంచాల నాగపురాద్య ధీశ్వరులు నాకన్న సన్ననే మెలఁగుచు, ఇతరరాజ్యముల నన్నింటినిఁగూడ జయింప నన్నుఁబురికొల్పుచుండఁగా, ఏకారణమువలన నేను మీతో సఖ్యముచేసికొనవలెనో నాకుఁ దెలియదు. ఇంతకును క్రూరవిరోధి యగు శ్రీముఖుఁడు బ్రదికియుండునేని యెప్పటికైన మాకు ముప్పు రాకమానదు. మీరు మీపురికరుగునది."

వల్లెయని యూపస్తంభుఁడు రాజుసభ వాసి చనియెను. సుశర్మయు ఆంధ్రరాజ్యము లన్నింటికిని సేనల నంపించి,కనకవల్లిని బలాత్కారమున బుష్యశృంగు నాశ్రమమునుండి చెఱఁగొనిరా మైత్రేయుని నియమించి, ఆంధ్రరాజ్యము లన్నియు నింతసులభముగాఁ దనకు రానున్నందుకు సంతోషించుచు సభ చాలించి యింటి కరిగెను.

—o—

# ఏడవ ప్రకరణము.



ఋష్యశృంగుఁడు కనకవల్లిని ఓదార్చు చుండెను. "అమ్మా! కనకవల్లీ! నీవు విచారింపకుము. సూర్యచంద్రులం బోలిన ప్రతాపమును గీర్తియుఁగలవారు, బుద్ధిని బృహస్పతిని దిరస్కరించువారు అపస్తంబ భట్టబాణులిరువురును శ్రీముఖుని సంరక్షించుచున్నారు. భట్టబాణుని యుక్తి విశేషముచే బౌద్ధు లమరావతీ పట్టణమును విడిచిపెట్టి పాటలీ పుత్రము వంక కరిగినారు. శ్రీముఖుఁడును ఆపస్తంబుఁడును సుశర్మ చక్రవర్తిని చెఱఁగొన్నట్లు ఆంధ్రలోకమున వార్తలు వెదఁ జల్లఁబడినవి. కొలఁది కాలములోనే మహాయుద్ధములు పొసఁగ నున్నవి. ఇంతకును శ్రీముఖుని ప్రధాన పట్టణము మరల ఆంధ్రుల స్వాధీనమై భట్టబాణుని సంరక్షణములో నున్నది. నీ తండ్రి జనకుఁడు సర్వవిషముల కోర్చుకొని పునర్జీవుఁడై కోసలారణ్యములలో మునివృత్తిని సంచరించుచు శత్రువిజయోపాయమున నున్నాఁడు. నా దివ్యదృష్టివలన నివియన్నియునాకుఁ దెలిసినవి. ఇది నీకు సంతోషసమయము గాని దుఃఖకాలము కాదు. కాఁబట్టి ఓర్చుకో."

కనకవల్లి కన్నీరు మున్నీరుగాఁ గాఱెను. "విభాండక పుత్రా! పరమపవిత్రా! మీయడుగు దామరలకిదే యంజలి నిడుచున్నాను. ఆ జగదేకవీరుఁడు ఆసత్యసంకల్పుఁడు, ఆధర్మా

వతారుఁడు నాబహిఃప్రాణమగు నా శ్రీముఖచక్రవర్తి సుఖముగా నున్నాఁడా! ఆతనికి జయము కలుగునా? ఆంధ్రరాజ్యమును తిరిగి ఏలఁగలఁడా? కామాంధుఁడు దుష్టాత్ముఁడు పరమనీచుఁ డాసుశర్మ నాశముచెందునా? నన్నుఁగన్న తండ్రి కరిమమున నన్నుఁ బెంచినవాఁడు జనకరాజర్షి పునర్జీవుఁ డయ్యెనా? ఓఋషికులతిలకా? అన్నింటికిని ఒక్క-మాటలో ప్రత్యుత్తరమిమ్ము. నా యభీష్టనము చేకూఱునేని ఎల్లరును సుఖులేని. మీ యాశీర్వచనములనంది నేను గూడ నరుగుదును. నాతండ్రినిఁ జూతును. భట్టబాణునికి సహాయము చేయుదును, సుశర్మను సంహరింతును. నాప్రాణనాథుని చెట్టఁ బట్టుదును. తండ్రీ! నాకు సెలవిమ్ము.” ఋశ్యశృంగుఁడు కనకవల్లిని ఓదార్చి “అమ్మా! ఘోరదుష్క-ర్మములకు ఆవాసమైన రణరంగము కామినీమణులకు విహారయోగ్యమైన ప్రదేశముకాదు. ఈ నర్మదాగర్భ ప్రదేశములందు, నవకిసలయ భరితములైన యీ పూవుం దోఁటలందు నీ సఖీమణులతోఁ గొంతకాలము విహరించుచు సంతోషముగా దినములు గడుపుకో. నిన్నంపవలసిన సమయము వచ్చినప్పుడుఁ నేనే నిన్ను ఆవల కంపగలను.

కనకవల్లి మునీంద్రునకు నమస్క-రించి, తన చెలికత్తెలను జేరెను. కొన్నిదినములిట్లు కడచిన వెనుక ఒకనాఁడు కనకవల్లి ఋష్యశృంగుని యానతినిఁ గొని వనవిహారమునకై బయనమయ్యెను. చెలికత్తె లందఱును ఆమెతోఁ జనిరి. తన్ను పరివేష్టించి ఇట్లూడిగములు చేయు భిల్లాంగనాశతము

లతో కనకవల్లి యా విహారా రామమునందు గొంతవడి విహరించి యలసి సొలసి, యటుపైన విరిసి నేల రాలిన పారిజాత ప్రసూనముల మెత్తపై ఒరిగెను. ఇంతలో పూలవాసనల భారమును మోయలేక డస్సి మందమందముగా నడచుచున్న మలయపవనుఁ డామెను స్పృశింపసాగెను. ఆ సోఁకుడులచే నామె యలసట వాసెను. మృదుకిసలయముల నవకంపు రంగులు ఆమె నేత్రములకు పండు వొనర్చెను. కలస్వనంబులఁ బాడుచు గండుంగోయిల లామె శ్రోత్రములకు విందొనర్చెను చక్కని చిక్కని పూవుఁ దేనియలఁ గ్రోలి ఝుమ్మని పాడుచున్న యళులకు సంగీతములు నేర్పుచు పంచేంద్రియములను దృప్తిపఱచుచున్న యా విహారా రామమున నించుక విశ్రమించి, లేచి కనకవల్లి తన చెలికత్తెయగు రాగవల్లరితో నుద్యానవన మంతటను మరల సంచరింప సాగెను. కనకవల్లి హృదయాందోళనము లన్నియు శమించెను.

"కనక సఖీ ! రాగవల్లరీ ! ఈ యుద్యానవన రామణీయకమును జూడుము. పతివ్రతా జనమనఃప్రియ సమాగమేచ్ఛా ప్రతిపాదన సామీప్యం బగు వసంతంబు కారణంబున నీ ప్రపంచమంతయు నెంత ప్రేమబంధురమై విరాజిల్లుచున్నదో ?

రాగ :—అవును. నీ కెప్పుడును పెండ్లి గొడవయే. చప్పున పెండ్లిచేసి పాఱవైచినయెడల నీ గొడగొడ అణఁగి యుండును.

కనక :—రాగవల్లరీ ! ఇందుచూడు మిందుచూడుము.

ఉ. ఆవిటపాగ్రమందుఁ దనర
    యర్థశరీరిణి కింపుఁగూర్చు ప్రే
మావృత దేహుఁడైన పిక ॥
    మాన్యునిఁ జూడు! వనాంతరబులన్
బోవుచు మంచి మంచి ఫల ॥
    ముల్ పరికించి రుచించి తెచ్చి యిం
పావహిలంగనిచ్చు సము ॥
    దంచితరాగ రసాతిరేకుఁడై."

రాగ :—అవును. దానికి రాగము నీకు పెండ్లిరోగము.

కనక :—సఖి ! ఈ పూవుం దీఁగను జూడుము.

మ. అతిమోదంబున గున్నమావిఁగని గా ॥
    ఢాలింగనం బిచ్చు నీ
లతకూనన్ బరిఫుల్ల సూనయుత లీ ॥
    లం జూచితే ? యిప్పుడం
చితమన్మానసపుష్పవల్లరియుఁ గాం ॥
    క్షించుం గదా యీశ్వరా
ర్పితమై యెన్నడుగాంచు విట్టి విలసత్ ॥
    శ్రీనంచునోకోమలీ,

రాగ :—ఓహో! నీపని సుతిమించి రాగమునఁ బడుచున్నది. ఈపాటికీ మాటలు చాలించు.

కనక :—రాగవల్లరీ! నన్ను కేరడములు చేయకే. ఆ సరో వర తీరమునందు ఊఁగులాడుచున్న ఆబాలునిఁ జూచి

తివా? కొలనిలోని చంద్రుని వెన్నముద్దయని భావించు
కొని దానినిఁ బట్టుకొనుటకై యెట్లరుగుచున్నాఁడో.

మ. ప్రతిబింబద్యుతి చంద్రుఁ డీకొలనిలోఁ
భాసిల్ల నాత్మీయమా
స్మృతులెల్లం దెగి వెన్నముద్దయనుభ్రాంతిం
బట్టఁ గేల్సాంచి య
ద్భుతనిర్విణ్ణ మనోజ్ఞుఁడై విసివిఁ దాఁ
ముగ్గం బ్రయత్నించు నీ
యతిమోహావృతశీలు బాలుఁగనుఁగోఁ
మ్మా! చిత్రమయ్యెఁ గడుఁ.

ఓహో! చేతికి చిక్కక ఆ వెన్నముద్ద అలల యలు
కుడుచే దూరమునకుఁ జెదరుచుండుటచే దానినిఁ బట్టుట
కీబాలుఁడు లోఁతునీటి కరుగుచున్నాఁడు. అయ్యో! నీట
మునిఁగి పోవుచున్నట్లున్నది. చప్పునపద.

రాగ:—సఖి! బాలుఁ డనుకొంటివా! కసుగందని నవనాళీక
ములతో బాలు నాకారముగాఁ జేసి మొన్న నీజలాశయ
మున మనముంచిన బొమ్మకాదా యది?

కద:—ఔనే! జీవకళ యుట్టిపడ నెట్లున్నదో చూడు. నిజ
ముగా దానినిఁ జూచి బాలుఁడనియే నేను భ్రమించితిని.
ఇదిగో యీ ప్రతిఫలించుచున్న చంద్రుని కిదియే నమ
స్కారము.

చ. చలువలఱేఁడ! కల్వలకఁ
సంబును గూర్చెడు మేల్మికాఁడ! రా

త్రులయెకిమీఁడ ! సంపదల కె
తొొయ్యలికిఁ సయిదోఁడ ! చీఁకటుల్
వెలినిడుప్రోఁడ ! మారునికిఁ
బీరము నిచ్చునమంగుకాఁడ ! యీ
జలముల నిన్నుఁబోలె నని
సంచలితుండగు నాథుఁ గావుమీ.

మామా ! ఓచందమామా ! ఇదే నీకు పునః ప్రణామము చేయుచున్నాను. నా మనోనాయకునకు దిగ్విజయ మొసంగుము.

మధుపములు వచ్చి యింతలో వీరిచుట్టును ముసురుకొనెను. రాగవల్లరి వాని బారి కాఁగలేక పారిపోయెను. కనకవల్లి యా సరోవరములోని సుధానిర్మితమైన మార్గమునఁబడి తన్మధ్యమున విరాజిల్లుచున్న మండపమును జేరెను. "ఇప్పటికీ భంభరములనుండి తప్పించుకొంటిని. కొంతసేఁపినీటి నడుమనున్న మండపమున విశ్రమింతునుగాక. ఆహా! శ్రీముఖ సార్వభౌమునితో నిట్టి యుద్యానములందు విహరించుభాగ్యము నాకెప్పుడు లభించునోగదా! ఇదె యొకలేఖ యిచ్చోటఁగాన వచ్చుచున్నది. దీని పై విలాసము గూడ ఎంత చక్కఁగా వ్రాయఁబడినది!

గీ. వినుత సౌభాగ్య సద్గుణో పేతసార్థ
కాఖ్య కనకవల్లీ నామ యమలచరిత
పేర వ్రాయంగఁబడిన యీ ప్రేమలేఖ
లీలఁ జేరంగవలె ఋష్య శృంగు వీట.

(నిట్టూర్చి) అక్కటా! ఏమిది? దురాత్మా! సుశర్మా! భూగర్భమునందు దాఁగుకొన్నను నీవలన తప్పించుకొన వీలు లేకున్నది. ఈ దుష్టశత్రువు బారినుండి నేనెట్లు వెలువడుదును? వాఁడే నాకీ యుత్తరము వ్రాసినాఁడు. దీనిని చదువఁదగునో అట్లే చింపి యీ తటాకమునఁ బడవేయవలెనో? చదివిచూతును గాక.

మ. సుగుణప్రాభవ :—ఇంతవఱకు ఆరంభము బాగుగానే యున్నది. దుర్నీతిపరులకు టక్కులు తెలియవా?

మ. సుగుణప్రాభవ చంద్రికాంచితయశః

శ్శోభాయమానాంగికిన్

విగతాజ్ఞానతమః ప్రశస్తశుభకృ

ద్విద్యానవద్యాంగికిన్

జగదున్మీలనమోహనాస్త్ర పటుదృ

క్సంధాన తన్వంగికిన్

మగుడన్ స్వచ్ఛతరాంతరంగికిని ప్రే

మాపుష్పసద్భృంగికిన్.

ఓహో! ముందు గుణములు, తరువాత విద్య, ఆ వెనుక రూపము – అహా! దుష్టులు కూడ ఇన్ని వేషములు వేయఁగలరు. కానీ! యింకను జదువనీ!

శా. భామారత్నమ నిన్నుఁ దొంటి సుకవి

బ్రహ్మల్ నుతుల్ సేసి న

న్నేమున్ వర్ణన సేయఁ జాలినను నెం

తే కౌశలం బొప్పఁగా

నీమాహాత్మ్యము నీపవిత్రగుణముల్ సొ
నీచాంగదుర్వర్ణన
ప్రాముఖ్యంబు హరించె నజ్ఞమతి కో సొ
పంబూనఁగాఁ బోఁకుమీ.

శా. లేమా! పిన్నటనాఁటనుండియు భవ ॥
ల్లీ లాసమాసక్తి నీ
సేమం బెప్పుడు కోరుచుందు మదె ని ॥
క్షేపంబుగా నెంచి నా
నోముల్ నేఁడు ఫలించు నీదుగుణసిం ॥
ధుల్ ద్రచ్చి నిన్మెచ్చు నీ
ప్రేమాపాత్రుని దీను భాగ్యవతివై ॥
వీక్షించి రక్షించినన్.

ఓరీ దుర్మతీ! నీవు ప్రేమపాత్రుఁడవు గావురా! నిజముగా నీవు వ్రాసికొన్నట్లు ప్రేమా పాత్రుఁడవే సుమా. కానీ.

శా. కాంతారత్నమ నీ కళాగుణముల౯ ॥
గాంక్షించితి౯ గాని దు
శ్చింత౯ నీమెయివన్నెలం దగిలి నిన్ ॥
సేవింపగాఁ బోను నా
యంతస్స్ఫూర్జితవృత్తి తెల్పితిని ని ॥
త్యానందముం గూర్చి మా
చింతల్ మాన్పుదొ? ప్రాకృతాత్మవయిగా ॥
సిం బెట్టుదో మన్నతి౯.

ఓరీ! దురాత్మా! తండ్రియింట నవివాహితనై యున్న నా కిట్లు వ్రాయుచున్నావా? ఇంతకును నీకు చేటుగాలము దాపించినది. శార్దూల మత్తేభములతో వ్రాసినంత మాత్రమున నేను జడియను.

చ. సతతము సద్గుణాకరుల
సంగతి నీతి నొకింత నేర్చి వి
శ్రుతుఁడగు బుద్ధదేవుఁ బరి
శుద్ధు నుతించు నొకింత నిల్చి త
ద్గతమతి రాజ్యపాలన వి
ధాయకకృత్యము లాచరించుచో
యతివ చరింతుఁ బాటలి పు
రాధివరుండ సుశర్మనాముఁడన్.

ఆహా! శార్దూల మత్తేభముల వెంట ముగ్ధాంగనలకు చంపక మాల నంపి పరితోష మొడఁగూర్చుట బౌద్ధశాస్త్ర పద్ధతి గాఁబోలు! నీవెంత బుద్ధిహీనుఁడవు! నీ నీతికి నీభక్తికి నీవే మెచ్చుకొనవలెను. ఇకఁ నిక్కడ ఒక్కక్షణమైనను నే నుండఁగూడదు. సుశర్మహతకుని జనులిచ్చటనే నాకొఱకుఁ గాచియుందురు. సీతను రావణుఁడు బంధించుకొని పోయినట్లు సుశర్మ నన్నును తప్పక కొనిపోఁగలవాఁడు. ఈ వింధ్యారణ్యములలో నే నున్నట్లు వానికెట్లు తెలిసెనో? తెలియకయేమి! వాయువిమానమును వెంబడించి వారును మా వెనుకనే వచ్చినా రేమో? ఏమైన నేమి? నే నీ విషయమును పూజ్యులైన ఋష్యశృంగుల వారికిఁ దెలుపుదును గాక.

కనకవల్లి యిట్లనుకొనుచుండఁగనే నలుగురు భిల్లాంగన లా వనములోఁ బ్రవేశించి దేవికి నమస్కరించి "అమ్మా! పూజ్యులైన ఋష్యశృంగులవారు ఈ సమీపపు టడవిలో నున్నారు. ఆయన మొగము కడు విచారమును సూచించు చున్నది. సత్వరముగ మీ రటకు రావలెనని వారియాజ్ఞ." అని పలికిరి. చెలికత్తెలతో గూడ కనకవల్లి యా భిల్లాంగనల వెంటఁబోయెను. సఖీమణులు దారిలో నాలేఖ సమాచారమును వినిరి. కొంతదూరము పీ రరుగుసరికి ఆ మార్గమున పొదల మాటున డాఁగుకొనియున్న సుశర్మహతకుని మనుష్యులు కనకవల్లిని ఉన్నపాటున వెనుకనుండి పైఁబడి పట్టుకొని యొక విమానములోఁ బెట్టుకొని పై కెగిరిపోయిరి.

—0—

# ఎనిమిదవ ప్రకరణము.

భట్టబాణుఁడు అమరావతీ విహారములలో నొకదాని యందు ఒంటిగాఁ గూరుచుండి ఏమో యాలోచించుచుండెను. ఆతని సమీపమున నేలమీఁద తాటియాకులపై వ్రాయఁబడిన లేఖ యొక్కటి యుండెను. ఆ లేఖయందు ముత్యములవంటి అపస్తంబుని విస్ఫుటాక్షరములు కానవచ్చుచుండెను. మంత్రీంద్రుఁడు ఆత్మగతముగా నేమేమో యాలోచించుకొనుచు, ఉండి యుండి యా లేఖను దీసి మఱల జదువుకొనుచు, నుదురు చిట్లించి, కనులు మిటకరించి, తల పంకించి మఱల తనలో తానే యేమో యూహించుకొనుచు కూరుచుండెను! ఆ లేఖయందిట్లు వ్రాయఁబడి యుండెను.

"భారత సార్వభౌముండును ఆర్ష ధర్మప్రవర్తకుండును నగు శ్రీముఖ చక్రవర్తి సచివుఁడైన భట్టబాణునికి ఊర్జిత ప్రణామపూర్వకముగా నాపస్తంబుఁడంపు లేఖార్థములు.

దేవా! బౌద్ధ శ్రమణకుని వేషముతో రాజేంద్రుని లేఖను గేలఁగొని నేను సుశర్మ రహస్యాలోచన సభ కరిగితిని. అమరావతి తనచేతఁ బడినదనియు, పాటలీపుత్రమున నొకమూల నజ్ఞాతవాసము చేయుచున్న మన చక్రవర్తికి భయపడి సంధిచేసికో వలసిన పని తనకు లేదనియుఁ జెప్పి యాతఁడు నన్నంపించి వేసినాఁడు. మనకు సహాయమొనర్పఁ

గల కటకము, విదర్భ మొదలగు రాష్ట్రములమీఁది కొతఁడు తనసైన్యములను నేఁడే యంపించినాఁడు. అందువలన నేను ఇంద్ర జాలికుని వేషము ధరించి రాజభవనమునకును, మంత్రి దండనాథాదుల యిండ్లకును బోయి నిజయోగ మాహాత్మ్యముచే సుశర్మను సుబుద్ధిని దండనాథుఁడగు మార్తాండుని యోగనిద్ర పుచ్చి మఱపించి తాము సెలవొసఁగిన రీతిగా వారిచే లేఖలు వ్రాయించి ముద్రలు వేయించి తమ సన్నిధానమున కంపుచున్నాను. కడచిన కఱవు కాలమున జాతివివక్షత లేకుండ నెల్లదేశముల వారికిని తా మొనర్చిన నిరతాన్న దానములవలన నాగులును పుండ్రులును పుళిందులును శబరులును బోయలును అసంఖ్యాకముగా మనసేనలందుఁ జేరుచున్నారు. బౌద్ధ ధర్మములను గాపాడుదు మనియు బౌద్ధులను హింసింపమనియు తాము ప్రకటించిన ప్రకటనకు భరతవర్షములోని యెల్లరాజులును హర్షించి రని వార్తలు వచ్చినవి. సుశర్మ హాతకునివంచించి చంపుటకు విషకన్యను సిద్ధము చేయించి యుంచినాను. మగధరాజ్యమునం దెల్లకడలను మనవారు ద్వైధీభావమును పొసఁగించుచున్నారు. సుశర్మచేత నుచితసన్మానము లందనివారలను బహుధనములచే సత్కరించియు, మాగధులలోని వల్లభావరుద్ధులకు, రాజదండితులకు, రాజుచే నవజ్ఞాతులైన వారలకు, ఉద్యోగములనుండి తొలఁగింపఁబడిన వారలకు, ఇతరకారణములవలన సుశర్మయెడ నసూయత చెందిన వారలకు ఆశపెట్టి యధికారములను మన్ననలను నొసఁగియు, ఏ సమయమున కెట్టి రాజనీతి యుచితమో

ఆ సమయమున కట్టి తంత్రమును బ్రయోగించియు, శత్రుపురమునను, నాతని యాంతరంగిక సభలను, గృహమునను గూడ నే నాతనికి శత్రువులను ఏర్పఱించి పెట్టినాఁడను.

మంత్రీంద్రా ప్రకృతమున ఆంధ్రులకు దినములు బాగుగ నుండలేదు గాఁబోలు! మన శ్రీముఖ సార్వభౌముఁడు తిరిగి రాజ్యపదవినిఁ బొందు టెట్లో? ఆంధ్రులుమగధ రాజ్యాధిపులై అకళంక కీర్తుల రాజిల్లు టెన్నఁడో! ఆంధ్ర నామము పవిత్రమగుగాక! ఆంధ్రుల దిగ్విజయములు ఆకల్పాంత స్థాయువులై ఆంధ్ర చరిత్రమునందు అద్వితీయమగుఁగాక! భట్టబాణా! నీ మంత్రప్రయోగమే ఈ పనిని నెఱవేర్పఁగలదు.

నే నింకను గొన్నినాళ్ళీ పాటలీ పుత్రమున నుండవలసియున్నది. సుశర్మ యేయేరాజుల సహాయము నపేక్షించి యున్నాఁడో వారలనెల్ల నేను సుశర్మకు విరోధులను గావించుచున్నాను. నాగచక్రవర్తియగు వాసుకి సహాయము నీతఁడు కోరునని విని నేను మన పక్షముననున్న యిన్నూరు మంది మాగధులను అతని గజములను బంధించుకొని రా నంపితిని. ఒక యరణ్యములో పదిలపఱుపఁబడిన యేఁబది యేనుఁగుల నీ మాగధులు బలిమిని తెచ్చుచుండఁగా వాసుకి సైన్యము లడ్డగించినవి. అప్పుడు మాగధులచేతికి నే నిచ్చిన సుశర్మ ముద్రికగల యుత్తరములు వాసుకిచేతఁ జిక్కినవి. వాసుకి నాగేంద్రుఁడు రౌద్రుఁడై సుశర్మను నాశముచేయ

శపథము పట్టినాఁడు. నాచే నంపఁబడిన మఱియొక మాగధుఁడు వాసుకి రాణియగు కపాలమాలికను జెఱపెట్టి తెచ్చుచు నాగులచే బట్టుపడినాఁడు. వానిచేతఁగూడ సుశర్మ ముద్రతోనున్న పత్రిక లుంపఁబడినవి. నా శిష్యుఁడగు భాస్కరుఁడు త్రికాలవేది యను ఖ్యాతినిఁబడసి, కాలజ్ఞుఁడై శత్రుసదనమున నున్నాఁడు. ఆతనికిఁ జెప్పకుండ సుశర్మ యేకార్యమును చేయుటలేదు. అశ్వినీదేవతల యంశమున నీ భూలోకమునం దవతరించి, రసవాద శాస్త్రమును దేవలోకమునుండి యీ మనుష్యభూమికి రప్పించి, మానవుల సమస్తరుజలను నివారణ మొనర్చుచున్న మన భిషగాచార్యుఁడగు నాగార్జునుఁడు, తన మునివృత్తి చాలించి శ్రీశైలపర్వతము వెడలి చక్రవర్తి కంగరక్షకుఁడై విరాజిల్లుచున్నాఁడు. నూతనవైద్య పద్ధతులను సృష్టించి లోకమున కొసగిన యాంధ్రుఁడగు నీ యపరధన్వంతరి వెనుక తమకుఁ జూపించిన పర్వతమును తన యోషధీ ప్రభావముచే బంగరు కొండనుగా మార్చివేసినాఁడు. యుద్ధమునకు వలసిన సమస్త ధనములును నా స్వర్ణ పర్వతమునుండి రావలసియున్నవి. సిద్ధనాగార్జునుఁ డీ విషయమును దమకుఁ దెలుపఁ వేఁడుచున్నాఁడు. తక్కిన విషయములను తమ రే గ్రహింపఁగలరు.

ఇట్లు మీ ప్రియసఖుఁడు,

ఆప స్తంబుఁడు.

భట్టబాణుఁ డిట్లాలోచించెను: "ఆంధ్రుల కాచంద్ర తారార్క స్థాయువు లగు సత్కీర్తులు పొడము కాలము వచ్చి నది. ఆంధ్రనామము పవిత్రమగుఁగాక. సుశర్మ హతకుఁడు బుద్ధిహీనుఁడై తన దేశములోని మూఁడువంతుల సేనలను కటకాది పురములమీఁది కంపినట్లు ఆపస్తంబుఁడును వార్తా హరులునుగూడఁ జెప్పుచున్నారు. కాఁబట్టి యిదియే పాటలీ మును ముట్టడించుటకు తగినయదను. ఈ సమయమున నా పురము ముట్టడింపఁబడెనేని, యితర దేశముల కంపఁబడిన యాతని సైన్యములు వార్త లేక తల్లడిల్లి, సహాయములేక చీకాకుచెంది, యెదిరి బలములచేతఁ బడి యెచ్చటి వచ్చట కిక్కురుమనకుండ నశించును. ఇందులకు సహాయముగా సిద్ధ నాగార్జునుని బంగరు కొండను గఱఁగించి నిష్కములుచేసి, సైన్యములుకూర్చి మనము పాటలీపురికిని, మిత్ర దేశములకును సహాయ మంపితిమేని మగధరాజ్యము క్షణకాలములో మన చేతఁబడును. ఇఁక శత్రువులచేత నున్న అమరావతిపురమా ? ఆపస్తంబుఁ డందుకుఁ దగినలేఖల నంపియేయున్నాఁడు. సుశర్మ బంధింపఁబడెననియు, పాటలీపుత్రము ముట్టడింపఁ బడినదనియు లేఖమీఁద లేఖగా సుబుద్ధిచేత వ్రాయఁబడి రాజముద్రికచే నలంకృతములైన యీ యాపస్తంబుని లేఖల నంపితిమా ఒక్కొక దుర్గమునే విడిచిపెట్టి మాగధులు వెడలి పోఁగలవారు. బంగరుకొండ నొకదానిని నాగార్జునదేవుఁడు ఆంధ్రుల కొసఁగినప్పుడు ఇతరరాజులు అపార సంఖ్యలుగా

మనకు సహాయులుకాక తప్పదు. ముందు అమరావతినుండి మాగధులను పాఱఁద్రోలవలెను. "

అని నిశ్చయించుకొని భట్టబాణుఁడు తన యెదుటి లేఖలను నిర్ణీతస్థానములందు దాచిపెట్టి తానొక పేదబ్రాహ్మణునివలె నా విహారమునందు "శంభో శంకర గౌరీశా సాంబసదాశివ సర్వేశా" యని యఱచుచుఁ గూరుచుండెను. సాయుధుఁడైన బౌద్ధభటుఁ డొక్కఁ డాశబ్ద మున్న తావునకు వచ్చెను. ఈ సంభాషణము జరిగెను.

ఎవ్వఁడవురా ? ఈ యమరావతీ విహారములలో బుద్ధ విగ్రహములను బెకలించివైచి యందు శివలింగములను బ్రతిష్ఠించి యారాధనము చేయుచున్నావు? అర్హాంత ! అర్హాంత ! పాపము శమించుఁగాక. అదరు బెదరులేక కండక్రొవ్వుతో ఘోతరించి ఏవో మంత్రములను గొణుగుకొందువేల ? త్రిభువన విజయైక సమర్థుఁడైన సుశర్మ చక్రవర్తి జీవించియుండఁగనే నీ కింత క్రొవ్వు పట్టినదా ?

"పిచ్చివాఁడా ! ఇంకను సుశర్మ యెక్కడ ? లోకోత్తర చరిత్రుఁడైన శ్రీముఖ శాలివాహనునిచే బంధింపఁబడి నీ సుశర్మ యిప్పుడు ప్రాణమాత్రావశిష్టుఁడై కారాగృహమున నున్నాఁడని నీకుఁ దెలియదా ? కొంచెము శాంతించు. మీ బౌద్ధులకిప్పుడు వినాశకాలము దాఁపరించినది. ఎన్నినాళ్లు నీ విట్లు దెగనీలుగుదువు ? "

"హా! హా! హా! లోకభీకరుఁడైన సుశర్మ చక్రవర్తిని ఈ యాంధ్రభృత్యుఁడా పట్టువాఁడు? గడ్డిపఱకతో మదపు టేనుఁగును బంధింపవచ్చునా? ఓరీ! వాచాలా! నీ శ్రీముఖుఁడు ఏనాఁడో మా రాజుచే బంధింపఁబడి యమలోకమును జేరినాఁడు. త్రాటిఁయాకు చప్పుళ్ళకు కుందేళ్ళు వెదరవు. రా! ఇటురా! ఈఖడ్గముయొక్క ధారను ఒక్కసారి చవిచూతువుగాని.

"ఓహో! నీకు ప్రపంచములో నేమి జరుగుచున్నదో తెలియనట్లున్నదే. పద! దండనాథునికడకు శీఘ్రమేపద! శ్రీముఖ సార్వభౌముఁడు గంగలోనికి దుమికి తప్పించుకొని నేటికి రెండుమాసములైనది. మా సార్వభౌముఁడు పాటలీపుత్రమునసే ప్రచ్ఛన్నముగా సంచరించుచు ఒకనాఁటి అపరరాత్రివేళ సంకేత మందిరమున పరాంగనలతో కేళీవిలాసమున నున్న నీ రాజును బంధించుకొని పోయి యొక రహస్య ప్రదేశమున నుంచినమాట నీకు తెలియదా? మీ మగధ సైన్యములన్నియు పాటలీపుత్ర సంరక్షణార్థమై ఆంధ్రదేశము నుండి వెడలిపోవుచుండగా దిక్కులు చూచుచు నీవి పాడు విహారములలో సంచరించెదవేల? మీ సేనానికి సర్వసైన్యాధిపతి వ్రాసిన లేఖను నీవు చూడలేదా? ఏవో ఊళ్ళకు మ్రొక్కుకొనుచు ఈ గుడిలోఁ బడియున్న యీ పేదబ్రాహ్మణునిపై బీరము చూపుట యొక గొప్పకాదు. ఓర్తువేని నీకు సరియైన వీరులతోఁ బోరి నీ క్షాత్రమును జూపుకో. పో! నీదేశమును సంరక్షించుకో.

ఆఁ! అవును. యుద్ధ మారంభమైన నాఁటనుండియు మీయాంధ్రులు బీరమును చూపుచునే యున్నారు. ఊళ్లకు అప్పలకు మ్రొక్కుకొనువారికి బీర మెట్లుండును? రా! యిటురా! నీ దేవుఁడు నిన్నెంత కాపాడునో చూతువు గాని."

"అది కాదు. ఈ మాట విను. సుశర్మ మాబంధనములో నున్నాఁడని నీకు ఋజువుచూపి శత్రు రహస్యములను నీకుఁ దెలిపినయెడల నామాట నమ్ముదువా?"

"ఆహా! నమ్ముదును. నాకు మీ రహస్యములను జూపి ఋజువు చేయగలవా?"

"అప్పుడు నాకు హాని చేయవుగదా? ప్రమాణము చేయుము."

"భగవానుఁడైన బుద్ధునితోడు. నేను నీకు హాని చేయను."

"ఆలేఖలను కొనిపోవుగదా?"

"కొని పోను."

"దేవాలయములలో నుండు నర్చకులకుఁ దెలియని యుద్ధరహస్యము లెవ్వియు నుండవు. సమస్తప్రమాణములును ఇచ్చటనే చేయఁబడును. ఇదియందఱకును కూఁడలి. ఎల్లజాతులవారును అర్చనార్థమిటకు వచ్చుచుండుటచే వారి సంభాషణలవలన నెల్లర మనోభిప్రాయములను నేము వినుచుందును.

నీ దండనాథునితోఁ జెప్పి నాకును ఆంధ్రరాజ్యమునందలి పది గ్రామముల నిప్పింతువేని నీ కీలేఖలను జూపఁగలను."

"అట్లే చేయింతును."

"ప్రమాణము చేయుము."

"భగవానుఁడైన తథాగతునితోడు. నాతల్లితోడు."

"పిచ్చివాఁడా! నీబుద్ధునిజోలి యెవ్వరికి కావలెను? రా! శివలింగమునకు నమస్కరించి, ఈ కపాలహస్తునితోడుగా ప్రమాణముచేయుము. అప్పుడుగదా నాకు నిజమైన నమ్మకము."

బౌద్ధుఁడట్లే శివునికి సాఁగిలబడి ప్రమాణము చేసెను.

"ఓరీ? ఇదియేనా నీ బౌద్ధమతము! నాబూటకపు మాటలను నిజమనుకొని నీయీశ్వరునికే ద్రోహము చేయుచున్న నిన్ను నమ్మి భట్టబాణుని మంత్రప్రయోగముల వివరములను నీకుఁ దెలుప వచ్చునా?"

"ఓరీ! మూఢా! అని బౌద్ధుఁడు కాలాగ్నిరుద్రుఁడై యర్చకునిపైకి ఖడ్గమును ఝుళిపించెను.

"స్వామీ! నన్ను చంపకు. బ్రతికియుండిన బలుసాకు ఏఱుకొని తినవచ్చును. ఇవిగో! ఈ స్తంభములో — ఈ జాతికింద — ఇవియే — ఇవియే —"

బౌద్ధుఁడు వానిని గ్రహించెను. "ఇవి సత్యమైన లేఖలేనా?"

ప్రతి లేఖయందును భట్టబాణుని ముద్రయో ఆపస్తంబుని ముద్రయో కానవచ్చుచుండెను. బౌద్ధుఁ డాలేఖలను

ఆమూలాగ్రముగాఁ జదివెను. "అర్చకా నీవు మంచివాఁడవు. నీకు తప్పక మా దండనాథునిచేత బహుమతి నిప్పించుదును. భట్టబాణుఁ డిచ్చటి కెప్పుడు వచ్చును."

"ఱేఁపటి యుదయమునకుఁగాని రాఁడు."

అట్లైన వీనిని నేను కొనిపోయి రాత్రివేళ నీకు మఱల నీయఁగలను."

"నిన్నెట్లు నమ్మవచ్చును. నీవీలేఖలను గొనిపోయిరా వేని నేను దండింపఁబడుదును. అప్పుడు నీకు మా తరువాత ప్రియత్నములు తెలియనే తెలియవు. నేనుగూడ వచ్చెదను. నన్ను మీ దండనాథుని కడకుఁ గొనిపోలేవా?"

వల్లె యని బౌద్ధుఁ డా యర్చకుని దండనాథుని కడకుఁ గొనిపోయెను. భట్టబాణుఁ డిట్లు శత్రురహస్యము లను దెలిసికొనుటకు వారి శిబిరములోని కరిగెను.

—0—

# తొమ్మిదవ ప్రకరణము.

వింధ్యపర్వత ప్రాంత్యారణ్యముల నుండి కించి దీశాన్య ముఖముగా నొక విమానము పోవుచుండెను. నదులను దరించుచు, నరణ్యములను గ్రహించుచు, మహా పర్వతములను లంఘించుచు, నా విమానము జివ్వుజివ్వున శరవేగముతో నాకాశతరణ మొనర్చుచుండెను. అది శరత్కాల మగుటచే భూమియంతయు మునిగోరంట బంతి మున్నగు పూలతో నలంకరింపఁ బడియుండెను. వర్షకాల మప్పుడే యంత్యమయినందున నదీప్రవాహములలో నీరుతగ్గి యందందు ఇసుక తిప్పలు బయలుపడుచుండెను. ఇంతదనుక లోఁతునీటియందు మునిగి పోయియుండిన నదులలోని రెల్లుదుబ్బుల తల లిప్పుడిప్పుడే నీటిపైన కానవచ్చుచుండెను. ఎఱ్ఱఁగలువలతోను, పొందామరలతోను, నల్లనిసారసములతోను, తెల్లని పద్మములతోను, నిండి జలాశయములు రత్నకంబళముల రీతిగాఁ బ్రకాశించుచుండెను. వర్షకాలమున మూల మూలలదాఁగుకొనియుండిన యళులు శరదాగమనమున సంతోషముతో బయలుదేరి ఝుమ్మని జేగుచు పుష్ప మకరందముల నాస్వాదించుచుండెను. కాఱు మేఘములు తమ యమృతములను భూమికిచ్చివేసి, కృశించి వివర్ణతనంది ఖండాఖండములై యింకను నాకాశ మార్గమున సంచరించుచుండెను. భూమి

లోని యార్యుల యిండ్లలో సరస్వతీపూజలును, వేతాళసేవ లును ఆరంభమయ్యెను. కాపాలికలు మహాభైరవిని నిలిపి నరబలులిచ్చి యారాధించుచుండిరి. శాక్తేయులు ముగ్గులు పెట్టి కుంకుమ నలంకరించి, కల్లుపాత్రమును నిండించి యుంచుకొని మాతృభావముతో కాళికాంగనలను బూజించుచు మనుష్యులను వధించి నివేదనము లిడుచుండిరి. ఇట్టి లోకవిచిత్రములను వీక్షించుచు నా విమానము ఊర్ధ్వగామియై పోయి పోయి వింధ్యాటవులను దాఁటి యొక్క విజనారణ్యమున నొక సరోవరము పొంత విడిసెను.

అప్పుడే ఆ విమానమునందున్న సుందరాంగియొక్క తె శిశిరపవన స్పర్శముచే సేదఁదేఱి కన్నులువిచ్చి చూచెను. చిరకాల జ్వరపీడితయగు రోగినిమాడ్కి బలహీనయై, యుస్సురని వెచ్చనిట్టూర్పువిడిచి యామె నలువంకలను బరికించెను. అప్పుడొక బ్రాహ్మణుఁడామెను సమీపించి, "అమ్మా! సేద తేఱితివా! నీకించుకయును భయములేదు. సార్వభౌముఁడు నిన్ను త్వరలోనే చెట్టఁబట్టి మగధరాజ్య లక్ష్మిని నీ కనుభవింప నీయఁగలఁడు" అని పలికెను.

ఆ సుందరాంగి ఆపలుకున కులుకిపడియు, లోనికోపము నుపసంహరించుకొని, లేచి నవ్వు మొగమునకుఁ దెచ్చుకొని, యమృతంపు వెన్నెల లొలయు నేత్రాంచల దృష్టుల నాతని వంకకుఁచూచి "ఓయీ! మన మిప్పు డెచ్చటనున్నాము!" అని యడిగెను.

"సుందరాంగీ! ఇది నాగ జేంద్రుఁడగు వాసుకిరాజ్యము. ఈమహారాజు పండ్రెండు పడగలను తలను ధరించువాఁడు. అతిరథమహారథులకన్న మిన్నయగు పరాక్రమము వాఁడు. మహాయోధ. బౌద్ధ ధర్మావతారుఁడు. ఈతఁడు ఎనుఁబది వేలమంది సైనికులతో నీహృదయేశుఁడగు మన సార్వభౌమునికి సహాయముచేయ బయలువెడలఁ బోవుచున్నాఁడు" అని చెప్పెను.

"మైత్రేయా ! ఈ పలుకులకు నే నలరుదునని తలంచితివా? సముద్రమునకును చవిటి పడియకును ఎంతటిభేదమో మహనీయుఁడైన ఆ శ్రీముఖ సార్వభౌమునకును గుణశీలములు లేని నీ రాజునకు అంతటి భేదము సుమా" అని యామె పలికెను.

మైత్రే :—అమ్మా ! కనకవల్లీ ! రాజ్యభ్రష్టుఁడై, కారాబద్ధుఁడై నేఁడో రేఁపో అని యున్న ఆ శ్రీముఖ భృత్యునే నీవింకను తలంచుకొందువేల ! ఆదుష్టుఁ డీపాటికి యమలోకమున పాఁతకాపై పడియుండును. సకలైశ్వర్య సంపన్నుఁడైఁ ఏకచ్ఛత్రముగా భరతవర్షమునంతయు ఏలుచు నిన్నుఁ గాంక్షించుకొని నీతోడిదే లోకముగా భావించుకొనుచున్న సార్వభౌమునితో సకల సుఖముల ననుభవింప లేక యిట్లు వెఱ్ఱిమాటల నాడెదవేల ?

కనక :— ఓయీ ! ఆర్షధర్మ ప్రవర్తకుఁడై, సదనుష్ఠాన దీక్షితుఁడై, కమనీయగుణ రత్నాలంకృతుఁడై, జగదేకవీరుఁడైన శ్రీముఖ చక్రవర్తియా నీరాజునకు లొంగువాఁడు.

.నీ బింకములును పొంకములును కనకవల్లిని మోసపుచ్చ ననుకొంటివా? అగ్నిని వస్త్రముతో మూటఁగట్టవచ్చును గాక! సూర్యచంద్రులను రెండుచేతులలో దాచిపెట్టు కొని దొంగతనముగా పాఱి పోవచ్చును గాక! శూలాగ్రమునందు నాట్యమాడవచ్చును గాక! శ్రీముఖ చక్రవర్తిని బట్టుకొనుటకు నీ రాజునకుఁ గాదుగదా వాని తలఁదన్నిన వానికైనను సాధ్యముకాదు. పిచ్చిమాటలాఁడెదవేల? శ్రీముఖుని వరించిన నన్ను నీరాజు పట్టుకొనుట నాలుకతో కత్తిని నాకు నట్లున్నది, సూదితో కంటిని గ్రుచ్చుకొను నట్లున్నది. మోయరాని బండను మెడకుఁగట్టుకొని సముద్రమును ఈఁదుటకు బ్రయత్నించు నట్లున్నది. ఇట్టి మాటలాడక, నీరాజునకు మేలుగోరితివేని వెంటనే నన్నుఁ గొనిపోయి ఋష్యశృంగు నాశ్రమమున విడిపించి, గతాసుఁడైన నీ రాజును గాపాడుకో.

మైత్రే :—అమ్మా! కనకవల్లీ! ఇవి యేటిమాటలమ్మా! అఱచేతిలోని సిద్ధాన్నమును బాఱవైచికొని పెడచేయిని నాకగోరు మూర్ఖు లెవ్వరైన నుందురా? సకలసామ్రాజ్య లక్ష్మీ ధురంధరుఁడైన సుశర్మ సార్వభౌముని విడనాడి విగతాసుఁడైన యా శ్రీముఖ హతకునికై పరితపించెద వేల? ఉత్తమవంశ సంజాతలైన రెండువేలమంది క్షత్రియ రాజేంద్ర తనూజలు నీకుబానిసలై యూడిగములు సేయు చుండఁగా నీకటాక్షములచే సార్వభౌముని నేలుకొనుచు తులలేని వైభవముతో కలకాలము సుఖింపలేక యేల

యీలీల మతిమాలి ప్రలాపించెదవు ? నీ శ్రీముఖుఁడు భృత్యుఁడు, దరిద్రుఁడు తుచ్ఛుఁడు, కల్మషుఁడు, ఇంత కును ఆదుర్మతి యీలోకమున లేఁడు, ఏనాఁడో వానిని మారాజు సంహరించినాఁడు.

ఆమాటలు వినఁగానే కనకవల్లి మహా పర్వతమువలె కంపించెను. మహా సముద్రమువలె కలఁతఁ జెందెను. రోష విషాదపూరిత హృదయయై తన మొలనుండి శూలమును బైకి లాగఁబోయెను. బ్రహ్మహత్యయని యించుక శంకించి ఋషి వాక్యములను దలంచెను. శ్రీముఖ చక్రవర్తి సార్వభౌముఁడై నన్నుఁ బరిణయముచేసికొనునని మునిపుంగవుఁడు చెప్పలేదా? ఇంతలో బ్రహ్మహత్యకుఁగాని ఆత్మహత్యకుగాని తానేలదొర కానవలెనని తలంచెను.

కనక :—ఓయీ! ఋష్యాశీర్వచన ఫలముగా నా జీవితేశుఁడు సుఖుఁడై యున్నాడుఁ లేదేని నా హృదయమునఎప్పుడో ఆకులత యుదయించి యుండును. అసత్యము లాడుటయు' పరస్త్రీలను వంచించి పట్టుటయు, మగధదేశీయుల బౌద్ధ ధర్మములో ?

మైత్రే:—కనకవల్లీ! నీవు కన్యకవుగాని, పరస్త్రీవి కావు గదా.

కనక :—బలిమిని వంచించి తెచ్చిన నీ రాజాంతఃపురము లోని రెండువేలమంది క్షత్రియాంగనలలోను పరస్త్రీలు కానివారెవ్వరైనను నున్నారా ? ఓయీ! నీకును నీరాజు

నకును నీతిగూడఁ గలదా? కాలకూట విషమునైన మ్రింగవచ్చును గాని పరాంగనలను హరించి నెగ్గరాదు సుమా.

మైత్రే:—నిర్భాగ్యుఁడైన నీ రాజుపై మనస్సు పెట్టుకొని సార్వభౌముని ఇట్లు నిందించుట కేవలము చపలముగదా.

కనక:—ఓయీ! పరమనీచుఁడైన నీసుశర్మకుఁ పోఁగాలము దాఁపరించినది. మా సార్వభౌమునికిని ఈ పాపాత్మునికిని ఇంచుకయైన పోలికకలదా? సింహమునకును నక్కకును ఎట్టి యంతరముగలదో బంగారమునకును సీసమునకును ఎట్టియంతరము కలదో, పరిమళముగల మంచి గంధమునకును నీటిబురదకును ఏట్టి భేదమున్నదో, మదపుటేనుఁగునకును ఊరబందికిని నెంత భేదమున్నదో, శ్రీముఖ సార్వభౌమునకును గుణశీలములు లేని నీ రాజునకును అంత భేదము కలదు. దేవేంద్ర సమానమైన ప్రభావము కలవాఁడై, వింటబాణము సంధించి మా శ్రీముఖ సార్వభౌముఁడు నిలిచినప్పుడు నీ సుశర్మలు గిశర్మలును అచ్చటనే హతులగుదురు సుమీ!

—0—

# పదియవ ప్రకరణము.



అట్లు భట్టబాణుఁడు అమరావతీపట్టణమునుండి మగధ సైన్యములను బాఱఁదోలి యీ యూర నిట్లు ప్రకటించెను.

"శ్రీముఖ చక్రవర్తి యిట్లు శాసించుచున్నాఁడు. బుద్ధస్తూపముల నెవ్వరును బడఁగొట్టరాదు. బౌద్ధుల నెవ్వ రును హింసింపరాదు. గౌరవము ఎప్పుడును మనప్రవర్తనము ననుసరించి యుండును. ఏ గుణములును ఎట్టి సమర్థతయు మానవునికి గౌరవమును బ్రసాదించునో ఆ గుణములను అట్టి సమర్థతను గలవారై పరులకు అపకారముచేయక, శత్రువు లను సహితము తమయుదార ప్రవర్తనమువలన మిత్రులను గా మార్చివైచుచు, బుద్ధిమద గ్రగణ్యులై యుండగల వారే యాంధ్ర నామమును వహింపదగువారు. తక్కినవారు కులము చెడఁబుట్టినవారు. దేశమునందు పేఁదరికమువలన దొంగతనము మున్నగునవియు, అనుకూల దాంపత్యాభావము వలన జారత్వాది దోషములును, మధుపానమువలన అవివేక ప్రచారములును దంభమువలన పరులస్వభావము నెఱుఁగలేక నరుఁడు తప్పుదారుల త్రొక్కుటయు సంభవించును. ఎచ్చట నైన ఎప్పుఁడైన నేమైనదోషము కాన వచ్చినప్పుడు కోపము చెందుటయు, శత్రుత్వమూనుటయు నవివేక లక్షణములు. దోషములకు మూలకారణ మెద్దియో శాంతచిత్తముతో

గమనించి, ఆ కారణమును నివారించిన యెడల ఆ దోషము తొలఁగి పోవును. దేశపాలనము నెడ నుచితధర్మముల నాచరింపవలసిన పని నాది. ఆంధ్రమను పదమునకు గౌరవము తేవలసినపని మీఁది. మున్నొకనాఁడు బందిపోటు దొంగలకుఁ బుట్టినిల్లైన యాంధ్రదేశమునందు సమస్త జాతుల వారికిని ధర్మాన్న సత్రములు నిలుపఁగానే దొంగతనములు నశించినవిగదా. మూలకారణము దోషజనకమైనప్పుడు మా న్యాయస్థానములుండియే యున్నవి. దేశీయులారా! మీరు వహించిన యాంధ్ర నామమును ఊరకపోనీయరాదు. ఆంధ్రుడనఁగానే సత్యవాక్కునకును సద్గుణపుంజమునకును నిధియని భారతవర్షీయుఁ లెల్లరును గౌరవింపవలెను సుఁడీ! మీరెట్లు ప్రవర్తింతురో! బలరాముని యనంతరమున మహా విష్ణువు బౌద్ధావతారుఁడై జన్మించినాఁడు. కాబట్టి బుద్ధదేవుని గూడ మీరెల్లరును నారాధింతురుగాక!"

చారుఁ డొక్కఁడువచ్చి భట్టబాణునికిసమస్కరించెను.

భట్ట:—దూరశ్రవా! ఏమి వర్తమానములను దెచ్చితివి?

దూర:—స్వామీ! ఏమియునులేదు. నిన్నటిరాత్రి సుశర్మ విమాన మొక్కటి వింధ్యపర్వతారణ్యముల వైపునకుఁ బోయినది. మైత్రేయుఁ డందుండినాఁడు. వాఁడు ఋష్యశృంగు నాశ్రమమునకు దారియెద్ది యని కొన్ని పల్లెల వారిని అడిగినట్లు తెలియుచున్నది.

భట్టబాణుఁ డా వేగరిని అంపించివైచి "ఓహో! మైత్రేయుఁడు సుశర్మకు రహస్యసేవకుఁడు. వాఁడు కనకవల్లిని

మోసమునఁ బట్టి కొనితెచ్చి మఱల తనరాజున కిచ్చుటకే బయలు దేఱినాఁడు. ఇదివఱ కొకసారి ఆమెను తప్పించితిని. ఇప్పుడేమి చేయవలెనో తెలియకున్నది. మైత్రేయుఁడు ఇట్టి పనులయం దాఱి తేఱినవాఁడు.

ఇంతలో మఱియొక చారుఁడు వచ్చి భట్టబాణునికి సమస్కరించెను.

"ఏమిరా! ఏమి సమాచారములు ?"

స్వామీ! దక్షిణకోసలాధిపతికి తమరంపిన బహుమానములు చేరినవట. బౌద్ధతైర్థికులు యథేచ్ఛముగా అమరావతికి వచ్చి బుద్ధ దంతము నారాధింపవచ్చుననియు, అట్టివారికి ధర్మాన్నసత్రములు వేయఁబడిననియు, విని రాజు కడు సంతోషించి, శ్రీముఖ చక్రవర్తిని వేనోళ్ళఁ గొనియాడు చున్నాఁడు. యుద్ధసమయము గావున, తన ముద్రిగల చీటి నీయకుండ ఎవ్వరిని అమరావతి కంపఁగూడదని మనవి చేయఁగా నాతఁడు సంతోషముతో దాని కంగీకరించినాఁడు. ఇదే సార్వభౌముని కీయుమని యీలేఖను ఈరత్నహారమును ఒసఁగినాఁడు.

భట్ట:—శ్రీముఖ చక్రవర్తి లోకోత్తరములైన యనేక నూతన బుద్ధస్తూపములుగూడ నిర్మింపఁ బోవుచున్నాఁడని మనరాయబారి యాతనికి చెప్పలేదా?

చారు:—చెప్పినాఁడు. ఇట్టి యుద్ధ సమయమునఁ గూడ సార్వభౌముఁ డీ పనికిఁ బూనినందున కాతఁడు సంతో

పించినాఁడు. బుద్ధుని విష్ణువు నవతారమనియెంచి ఆంధ్రు లాతనిఁ గూడ నారాధింప వలెనన్న తమ ప్రకటనను రాజేంద్రుఁడు కడు.—

భట్టు :— సుశర్మ రాయబారములను వేనినిఁ బంపలేదా ?

చారు:— తెలియదు. కాని, సద్వర్తనము గౌరవదాయకము. దుర్వ్యవర్తనము తను హానికిని లోకనిందకును గారణము. సుశర్మయొక్క తుచ్ఛప్రవర్తనమునకు కోసలరాజు కుపితుఁడై మన సార్వభౌముని శాంతసౌశీల్యములను గడుఁ బొగడుచున్నాఁడు. అందును మతవిషయమునఁ గూడ నింతటి సమభావమును చూపుచు వ్రాసిన మన లేఖ యాతనిని మనకు పరమమిత్రునిఁగా మార్చివైచినది.

భట్టు :—ఆతని రాజ్యములోనున్న యాంధ్రుల ప్రవర్తనము చక్కగా నున్నదా ?

చారు :—ఓహో! శాంతమునకును సౌశీల్యమునకు బుట్టినిండ్లయి మన యాంధ్రులా దేశమున వన్నెయు వాసియుఁ గాంచి సమస్తగౌరవములను అనుభవించుచున్నారు.

భట్టు :—ఇప్పుడేకాదు-శాంతమునకు సౌశీల్యమునకును బుట్టినిండ్లయి ఎల్లకాలములందును ఎల్లదేశములందును ఆంధ్రులిట్లే మహాగౌరవము ననుభవింతురుగాక! పరమేశ్వరా ! ఇవి తెనుఁగువాండ్రకు సహజగుణము లగునట్లు కృప సేయుము. ధనధాన్య సంపదలతోఁ దులఁదూగుఁచుదయా

దానాదులగు నానాసద్ధర్మములకు ఉనికి పట్టులై ఆంధ్రులు సుఖింతురుగాక! ఆంధ్రనామము గౌరవమునకు పర్యాయ పద మగునుగాక!

ఇట్లాసమయమున నాంధ్రరాజ్యము లన్నియు యుద్ధోన్ముఖములై శ్రీముఖునికి నానా విధముల సహాయమొనర్ప దొడగొనెను. సుశర్మహంతకుడు అన్యాయముగా శ్రీముఖ సార్వభౌముని చెఱఁబెట్టెననియు, అందుండి తప్పించుకొని రాజేంద్రుండు మంత్రోపాయ చతురుఁడై మగధరాజ్యమును జయించి ఆంధ్రులకు భరతవర్ష సార్వభౌము లన్న కీర్తిని సంఘటింపఁ జేయుననియు, ఒక్క బాణమునైన వదలక తానే బాణమై భట్టబాణుఁడు నిజమంత్ర ప్రభావము వలన నమరావతినుండి మాగధులను నద్భుతముగాఁ బాఱఁద్రోలి వారు తిరిగి యటుప్రక్కకు రాకుండునట్లు మార్గమునందలి దుర్గములకు అజేయములగు నాంధ్రసైన్యములను గాపుంచెననియు సకలాంధ్ర రాష్ట్రీయులును చిత్రకథలుగాఁ జెప్పకొనసాగిరి.

ఆకాలమునందు ప్రసిద్ధములైన యాంధ్రరాష్ట్రములనేకములు దక్షిణ హిందూదేశము నందుండెను. అందు కోసలదేశము వేయి చదురపుమైళ్ళ వైశాల్యము కలది. మహాంధ్రమను నామాంతరము గల ఈ కోసలదేశము ఉత్తరమున ఉజ్జయినివఱకును, దక్షిణమున నాంధ్ర కళింగరాజ్యములవఱకును వ్యాపించి, ఓఢ్ర మహారాష్ట్రములు తనకు పశ్చిమోత్తరపు టెల్లలుగా విరాజిల్లుచుండెను. కవులచేఁ గొని

యాడఁబడు నర్మదయు మహానదియు నీకోసలముననే జన్మిం చినవి. తపతీ గోదావరీనదుల పుణ్యజలము లీ రాజ్యమును బవిత్రీభూతము చేయుచుండెను. ఇందలి జనులు శ్రీముఖ రాజేంద్రునికి సహాయులై నిలిచి యాంధ్రకీర్తులను విస్తరింపఁ గృతనిశ్చయులైరి.

కోసలమున కించుక సమీపమున దాని కుత్తరపు దిక్కున కరూశ దేశముకలదు. మలద కరూశ దేశములు శ్రీరాముని కాలమునఁగూడ నతిప్రసిద్ధములైయుండెను. కరూ శాధిపతియగు చాణూరుఁడను నాంధ్రుఁడు శ్రీకృష్ణునితోఁ బోరి సమసెను. ఆకరూశదేశపురాజు ఆత్మీయమైన యాంధ్ర రాజ్యమునకు సంప్రాప్తమైన యిక్కట్టులను దలంచుకొనిలోక ములో నాంధ్రమన్న పేరు లేకుండఁజేయ నెంచిన సుశర్మ శప థమునకుఁ గడువగచి, అయాచితముగా శ్రీముఖునికి రాయ బారమంపుచు, అందుఁ దా నాంధ్రుడననియుఁ, దనదేశ మాంధ్రమనియు, నాంధ్రదేశములకు దిగ్విజయమునుగూర్చ నీసమయమున దన్నుఁగూడ సహాయులలో నొకరినిగా నంగీ కరింపుఁడనియుఁ దెలియఁబఱిచెను.

కోసలదేశమునకు దక్షిణమున ఆంధ్రరాజ్యముకలదు. ఇది ఏనూరుమైళ్ళ వైశాల్యముగలిగి గోదావరిలో మంజీర గలియు స్థానమునుండి భద్రాచలము వఱకును వ్యాపించియుం డెను. ఇందు అభేద్యములగు ముప్పదికోటలు గలవు. ఆంధ్ర దేశీయులెల్లరును శ్రీముఖ చక్రవర్తిపేరు చెప్పినంతమాత్రము

ననే పరవశులగుచు యుద్ధమున కరుగుట యెప్పుడెప్పుడని యంజెలు వేయుచుండిరి.

ఆంధ్రదేశమునకు పూర్వపశ్చిమములయందు కళింగ రాజ్యముగలదు. ఈ యాంధ్రరాజ్యము సింహబాహునివలన స్థాపింపఁబడి, యాంధ్రులతో నెప్పుడును నెయ్యము వహించి యేయుండెను. దీని వైశాల్యము ఎనమన్నూట ముప్పది మూఁడు మైళ్లు. ఆంధ్రులకు పవిత్ర పర్వతమగు మహేంద్రమీ కళింగములోనిదే. మహేంద్రగిరి నుండి దక్షిణమున గోదావరి వఱకును వ్యాపించియున్న యీ రాజ్యమునకు సింహబాహుఁడు సింహపురమును రాజధానిగాఁ జేసికొనెను. ఈ సింహబాహుని కుమారుఁడగు విజయుఁడు సముద్రమార్గమున సింహళద్వీపముచేరి దానికి నాయకుఁడై పాండ్య దేశాధిపతి కుమారితెను వివాహ మాడినవాఁడు. కళింగాధిపుఁడు తనమీఁదికి వచ్చిన మాగధుల సైన్యములను జక్కాఁడి, శ్రీముఖునికి సహాయ మొనర్చుటకై పాటలీపుత్రము వంక కరిగెను.

ఇట్లు ఆంధ్రరాజ్యములన్నియు వలసిన సన్నాహము లనుచేసి కొనుచుండఁగా, భట్టబాణుఁడును అప్రమత్తుఁడై తగిన యుపాయముల నరసి కార్యసాధకుఁ డగుచుండెను.

“ **ఆహా!** ఈ యాంధ్రనామ మెంత గౌరవ నీయమైనది! అమోఘ దీక్షాధురంధరుఁడై పట్టినపట్టును విడువక సాధించిన యుద్దండ తపః ప్రభావుఁడగు విశ్వామిత్రుని యంశమున క్షాత్రవీర్యము నపహసించు బ్రహ్మతేజోబలమున

నుద్భవించి, సమస్త శుభకర్మలకును స్థానభూతమగు పవిత్రిత శేయ మహాబ్రాహ్మణ విధానమున వైదిక మార్గానుసార ముగా నామకరణ మహోత్సవమును జరిపించుకొని అటు వెనుక ఏ వేదవిద్యా విశారదుఁడు బోధాయ నాశ్వలాయన కాత్యాయ నాదులకన్న మిన్నయై, అలభ్యములగు కంకటి కలబావి పైంగయాని, సత్యయాని శైలాలి మున్నగు బ్రాహ్మణములందుఁ గూడ నాతితేజనో ఏ ప్రఖ్యాత గుణోత్త రుఁడు విపులములై విధ్యుక్తములై విమలములై విశ్వవిశ్వం భరావిధాయకము లైన శ్రౌత సూత్ర రాజములను దన పేర లోకమున నా చంద్రార్క స్థాయిగా వెలయించెనో వేదము లకుఁ గూడ తాను చూపిన మార్గ మొక్కటియే సత్యమైన మార్గమగు నట్లుచేసి యే సత్యసంధుఁడు ప్రామాణిక మహా పురుషులం దుత్తమోత్తముఁడై "ధర్మబుద్ధి జనకత్వాద్వేద వత్త"ను వాక్యమును తాను నిర్ణయించిన ధర్మములపట్ల శాస్త్రకోవిదులు పలుకు నంతటి కీర్తి విస్తార ధురంధరుఁ డయ్యెనో గోదావరీతీర నివాసుఁడై ఆంధ్ర ధర్మవేదియై యే మహనీయుఁడు నేఁటికిని దేవదానవ దేశములందుఁ గూడఁ గొనియాడఁ బడుచున్నాఁడో అట్టి యకలంక వేదవిద్యా స్వ రూపుఁడగు నాపస్తంబునిచేత చౌలోపనయనాది సంస్కార ములనంది, ఆంధ్ర పుత్త్రుఁడు భరతవర్షమునకంతకును, నేఁడు స్వేత చ్ఛత్రాధిపతి కాఁబోవుచున్నాఁడు. తార హార పటీర నీహార హీర సారకీర్తియగు శ్రీముఖ చక్రవర్తి యుండఁగా, ఆపస్తంబుని వంశమున జన్మించిన యాపస్తంబుఁడుండఁగా

ఆంధ్రగౌరవమునకు లోపము కలుగునా? పోయిన ప్రాణమును గూడ బట్టితేఁగల సిద్ధనాగార్జునుఁడు ఆంధ్రుఁడే యైనప్పుడు ఆంధ్రుల కేమి లోపములుండఁగలవు? ఆనాగార్జునుఁడు శాతవాహనకుల దీపకుఁడగు మన శ్రీముఖ సార్వభౌమునకు వ్రాసిన యీ సుహృల్లేఖ యెంత హృదయంగమముగా నున్నది! ఆంధ్రదేశమున కలంకారస్థానమగు దక్షిణ కోసలమున బ్రాహ్మణవంశమున జన్మించి విద్యాభిరతుఁడై దేశదేశములు తిరిగి యద్వితీయ విశారదులగు మహనీయుల యొద్దఁజేరి చతుష్షష్టి కళలను సంపూర్ణముగా నేర్చి, అటువెనుక బౌద్ధమత వ్యాపకమునకై నిరంతరము కృషి సలుపుచు లోకముచే బుద్ధుని పదునాలుగవ యవతారముగా గౌరవింపఁబడి కాశ్మీర నాయకుఁడగు కనిష్కుని సభ కలంకారభూతుఁడై కొన్నినాళ్లు నిలిచి, స్వకీయాంధ్రదేశమునకు నూతన కీర్తులను వెలయించుటకై యిచ్చటికి వచ్చిన యీ నాగార్జునుఁడు మన కుండఁగా, ఆంధ్రదేశమున కేమికొదువ ? నిజ మంత్రప్రభావము వలన పాతాళలోకములోని నాగేంద్రుని కడనుండి సమస్త విషాపహారిణియగు మందాకినీ మహాత్త్రికమును దెచ్చినవాఁ డీ సిద్ధనాగార్జునుఁడే కదా! పాతకమును సహింపలేక యీతఁ డొక కాలమున ధర్మమీమాంసరాఁగా బెల్లుగడ్డితోఁ దన కుమారుని శిరమును ఖండించి శాస్త్రోచిత శిక్ష నొనర్పలేదా? నీటిపైన సూదిని దేలించి దేవునికి అద్భుతమును గొలిపినవాఁ డీ నాగార్జునుఁడే కదా. నాగార్జునుఁ

డెఱుఁగని విద్య లెయ్యవి? నాగార్జునుని చేతఁబడి వృద్ధిఁ గని ప్రకృతి శాస్త్రము లెయ్యవి? బ్రహ్మవిద్యావిశారదుఁ డగు మిళిందసార్వభౌముఁడు తనయుక్తి నిపుణతచే బౌద్ధుల నోడించి వారిని హిమాలయ ప్రాంత భూములకును మానస సరస్తీరములకును దఱిమి వేయుచున్న దుష్కాలమున నీనాగార్జునుఁడే కదా తన మహాయన తత్వములను లోకమున వెల యించి, మిళిందుని నిరుత్తరుని జేసి జయము గాంచినవాఁడు. బుద్ధదేవుని వాక్కులను గొంపోయి తమకడ సేకరించి యుంచుకొని నాగులు మున్నూరు సంవత్సరము లా మహాధనమును ఏ యపరబుద్ధుని కొఱకై కాపాడిరో, ఎవ్వని భవిష్యదవతారమును శాస్త్రములు సర్వదా నుడువుచుండెనో యట్టి కారణ జన్ముఁ డీ నాగార్జునుఁడే కదా. ఈతని కొఱకేకదా మన శ్రీముఖ రాజేంద్రుఁడు తనకుఁగల ధనములెల్ల ధారవోసి శ్రీశైల పర్వతమును నివాసయోగ్యము కావించి యిచ్చినాఁడు. మంత్రతంత్రప్రాయ చతురుఁడై యాంధ్రుఁడై దశదిగంతములకును వ్యాప్తించిన కీర్తితో నీ యవతార పూరుషుఁడు నేఁడు తన యాశ్రమమునువదలి సార్వభౌముని కడఁకు జేరుట ఆంధ్రుల పుణ్యవశముననే కదా. ఆంధ్రజాతికి నాశము వచ్చునప్పుడు యతులు సహితము యుద్ధమునఁ బాల్గొనుచున్నారు. ఇంతకంటె శుభావహమగు విషయమెయ్యది. ఆంధ్రనామము పవిత్రమగుఁగాక."

ఇట్లు తనలో తానే భట్టబాణుఁడు ఆంధ్రనామోచ్చారణము చేసికొనుచు, మహాకోసలాంధ్ర, కళింగాది రాజ్యములకు తిరిగి యుచితలేఖలను వ్రాసి, చారుని కొసఁగి, యుద్ధ ప్రయత్నములను పూర్ణము కావించెను.

# పదునొకండవ ప్రకరణము.

దండకారణ్య మధ్యమునందు నాగపుర మను నొక పట్టణము కలదు. అసమాన రూపలావణ్యవతులైన సుందరాంగులతోను, నిరంతర భోగపరాయణులైన పురుషోత్తములతోను ఆ పురము విరాజిల్లుచుండును. దేవతాంశ సంభూతులై, మణిమంత్రౌషధ రహస్య విశారదులై, పేదరికమును రుజయు నెఱుఁగక, తత్పురజనులు సర్వదా సుఖులై చరించుచుందురు. దండకారణ్యములోని యుత్తరభాగమున కంతకును నధీశ్వరులై నిరంతరమును మదవతులతో వనముల సంచరించుచు, పూఁబొదరిండ్ల విహరించుచు, పూవు నెత్తములపై శయనించుచు, జుంటితేనియల నాస్వాదించుచు, పండి విరిసిన పనస కదళీ మాకందాది ఫలముల నాహారించుచు, మంత్ర ప్రభావముచే సింహశరభ వ్యాఘ్రాది మృగములను సహితము కట్టుకట్టి కుక్కలవలెఁ దమవెంటఁ దిరుగాడఁ జేయుచుఁ దమ యుత్తమ జన్మమును సూచింప శాంతదాంతాది సుగుణములను సహజ లక్షణములుగాఁ జేసికొని యీ దివ్యజాతివారు లోకోత్తర వైభవములలోఁ బెంపారుచుందురు. తమతోడి జాతివారైన పుండ్రులను దాసానుదాసులనుగా నొనర్చి వారికంటె నధిక తరులైన పుళిందులను మాఱుమూలలకు దోలివైచి, శబరులను కేవలము ఆటవికులను

గానే గావించి ఆంధ్రుల సహాయముతో దండకారణ్యము లోని రాక్షసులను నిర్మూలము చేసివైచి, నాగవంశమువారు ఆంధ్రులతో సమానకులస్థులై, వారివలెనే పట్టణములను బల్లెలను నిర్మించుకొనుచు, సేనావ్యూహములను బన్నుకొనుచు, రాష్ట్రములను సంపాదించుకొనుచు, నాగపురము తమకుఁ బ్రధాన పట్టణముగా దండకారణ్య మధ్యమునందు నివసించు చుందురు. కాలసర్పములను శిరోవేష్టనముగాఁ జుట్టుకొని, ముఖమ్ము మీఁదఁకు ఎండ తగులకుండునట్లుఁ వానిచే పడగలను విప్పించుచు నాగజాతివారు మంత్రౌషధ ప్రభావముచే స్వేచ్ఛావిహారము లొనర్చుచుందురు. నాగులరాజు కిరీటములపైన పండ్రెండు కాలసర్పము - లెప్పుడును పడగలు విప్పుకొని యాడుచుండును. ఎట్టి పామునైన బట్టుటయందును విషము దీయుట యందును, మచ్చిక చేసికొని దానిని కంఠహారముగా వేసికొనఁ జాలుటయందును దేవతాంశ సంభూతుల కేమి కష్టము ?

ఇట్టి నాగులకు సార్వభౌముఁడగు వాసుకి యొకనాఁడు తన యిరువదిమంది భార్యలతోను పరివారముతోను నాగపురము వెడలి బుద్ధదేవుని నారాధించుటకై అరణ్యములోని కరిగెను. ఆ విపినమధ్యమున నాతఁ డొక్కచోట విడిసెను. పరివారమంతయు నాతనిచుట్టును గావలి కాయుచుండెను. రెండుదినము లట్లుకడపి మూఁడవ నాఁటి యుదయమున తన పట కుటీరమునందు వాసుకి నాగేంద్రుఁడు తన భార్యలతో గవ్వలాడుచుఁ గూరుచుండి యుండెను. ఇంటియం దెల్లకడ

లను నాగుబాములు విచ్చలవిడి సంచరించుచు నాలుకలను ఝళిపించుచు, నాగేంద్రునిమీఁదికిని నాతని రాణులమీఁదికిని నెగబ్రాకుచు, కాళ్ళకు కడియములుగాను, చేతులకు భుజకీర్తులుగాను, శిరస్సులకు కిరీటములుగాను, చుట్టుకొని పడగలు విప్పుచు, ఒక్కొకప్పుడు తమలో తామే పోరాడుకొని బుస్సుమని తోఁకమైన నిలిచి యొండొంటిపైఁ బడుచు, అలవాటుకాని క్రొత్తవా రెవ్వరైన లోనికివచ్చిన యెడల, క్రోధోద్రేకముతో వారి పైకిలేచి, తటిమి తటిమి కొట్టుచు విహారములు సలుపుచుండెను. వాసుకి చక్రవర్తి కూరుచుండిన కూటమున కెదురుగా నొక గదిలో నలుగురు నాగులొక మనుష్యుని నొక నులక మంచముపైఁ గట్టిపెట్టి యుంచిరి. ఆమనుష్యుఁడు వారినిఁజూచి "ఓయీ! ఇదియేనా మీ బౌద్ధమతము? జంతుహింస కూడదని బుద్ధదేవుడు వచించి యుండఁగా నాటి బౌద్ధుని నీ రీతిగా చంపవచ్చునా? అని యడుగుచుండెను. "నిషాదా ఆలస్యము చేసెదవేమి. కపాలమాలికను గొనిపోయి సుశర్మకు సమర్పింప నరుదెంచిన యీ మహాద్రోహిని బ్రిదుకనీయ వచ్చునా? కానీ! చప్పునకానీ! వెంటనే వీనిని కాళికా శక్తికి బలిపెట్టు." అని సేవకుఁడొక్కఁడు అవ్వలనుండి కేకవేసెను. గవ్వలపేరులను కొమ్ములను ఆభరణములుగా ధరించుకొని నారబట్టలు సింగారించుకొని, మొగమునిండ కుంకుమ పూసికొన్న శాక్తేయుఁడొక్కఁడు, 'జయ కాళీ యని' గండ్రగొడ్డలితో నా మనుష్యుని శిరమును తెగవేసెను. గవ్వలాడుచున్న రాణులలో

నొక్కి తె రాజువంకకుఁ జూచి “ రాజేంద్రా! ఇట్టి క్రూర కృత్యము నీకు తగునా ! యని మందలించెను. “ వాఁడు సుశర్మ చక్రవర్తి రాయబారి. వానికిదియే శాస్తి. ” అని వాసుకి ప్రత్యుత్తర మిచ్చెను. సుశర్మ పేరు చెప్పఁగానే రాజు పట్టపురాణి మూర్ఛచెంది నేలవ్రాలెను. “అయ్యో!ఆదురాత్మ ర్నుఁడే మన కపాలమాలికను మున్నొకసారి కూడ చెఱఁగొని పోయినాఁడు. నాగలోకాధీశ్వరుఁడైన వాసుకి చక్రవర్తికి పట్టంపు టిల్లాలనియైన సంకోచింపక నాఁడు వనవిహారమున కరిగినప్పుడా దుష్టుఁడే కదా మన కపాలమాలికను కొని పోయినది. ” అని మఱియొక రాణి పలికెను. “ ఆంధ్రులు పాటలీపుత్రమును ముట్టడింతురఁట ! అందువలన నాగులు మాగధులకు సహాయము చేయవలెనఁట ! మన సహాయము నందుట కొఱకే సుశర్మ యిప్పుడీతనిని మనకడకు బంపి నాఁడు. వానికి తగిన శాస్తియైనది. ” అని వాసుకి మఱల ప్రత్యుత్తర మిచ్చెను. “ అందువలననే సంకోచింపక వాని నాశాక్తేయున కప్పగించినాను. సిగ్గులు లేక, వాఁడు నా కెట్టి సందేశమును బంపెనో ? ”

“ దేవా ! సిగ్గులు గుణవంతులకుగాని, మధుపాన మత్తులకును పరస్త్రీరతులకు, వంచకులకును సిగ్గులుండునా?” అని యాతని ద్వితీయభార్య కమల పలికెను.

“ కమలా ! కపాలమాలిక యెడల వాఁడు తలఁచిన ద్రోహమును నేను మఱువలేదు. కాఁబట్టి నేను ఆంధ్రులకు సహాయముచేసి, సుశర్మను సంహరింపవలెను. ఇంతవఱకును

మాగధుల కంపుటకే మన సేనలను సిద్ధముచే యుంచితిని కాని, ఇప్పుడా యభిప్రాయమును మార్చుకొన్నానుసుమా"

కమల :—అవును. కాని ఆంధ్రచక్రవర్తియగు శ్రీముఖుఁడు మనకు ప్రబలవిరోధి కదా.

వాసు :— విరోధ మేమియు లేదు. మన బౌద్ధమతమును ఆతఁడు ద్వేషించువాఁడు కాఁడు. బుద్ధుఁడు విష్ణువు నవ తారమని యాతని నిజమైన నమ్మకము. కాని మనుష్యులను గౌరవించుట ఎల్లవారికిని విధియనియు, నాగులు నాగరకులు కావలెననియు నాతఁడు పలుమాఱు పలుకు చుండును.

కమ :— ఇంతకును ఆతఁడు బౌద్ధుఁడుకాఁడుగదా !

వాసు :—అది కాదు. ఆతఁడు బౌద్ధధర్మాభిమాని, అభిమాన మనునది కుటుంబమునుండి స్వజనమునకును అందుండి స్వజాతికిని, అందుండి మనుష్యలోకమునకును వ్యాపింపఁ జేయవలెనని కదా బుద్ధదేవుని నీతి. ఈ బౌద్ధ ధర్మమును ఆతఁడు ఆచరణము లోనికి తెమ్మను చున్నాఁడు.

కమ :- -బౌద్ధులు కానివారిని గౌరవించుటెట్లు ?

వాసు —ప్రాణసఖీ! అదికాదు. ప్రాచీనధర్మము లెప్పుడును స్త్రీలనే అంటి పెట్టుకొని యుండును. పూర్వాచారములు వారి వలననే సమస్త దేశములందును ఇప్పటికిని ఉద్ధరింప బడుచున్నవి, నవీనములైన యు తమ ధర్మములు వారి వలననే అంకురము కాఁజాలకున్నవి. నీవు వేయిమాటలు

చెప్పినను నేను శీఘ్రముఖ చక్రవర్తిని దూషింపఁజాలను. ఆతఁడు ధర్మస్వరూపుఁడు, నిత్యసత్యనిరతుఁడు, శాంత శీలుఁడు నేఁటినుండియు నా రాజ్యము ఆంధ్రులకే అమిత సహాయము చేయును.

కమ :—ఏమీ! బౌద్ధులు కానివారికి సహాయము చేయు టయా? ఇప్పుడు మీరు సనాతనధర్మమును మీఱి ఇట్లు నాగులను క్షోభ పెట్టవలసిన యావశ్యక మేమి వచ్చి నది? ఈనాగుల సహాయము తన కక్కఱలేదని మొండి పట్టు పట్టుకొని కూరుచున్న దుష్టుఁడైన యా రాజ్య భ్రష్టుని నిమిత్తమై మీరు మన పూర్వాచారముల నేల నశింపజేయవలెను.

వాసు :—"సుందరాంగీ! ఇదియే కదా స్త్రీల నైజము. వారెంత సున్నిదమైన మనస్సుగలవారు!" అని చెప్పుచు వాసుకి కమలను ముద్దిడుకొనెను. "ఓయీ! దౌవా రికా! ఇదియే నా యాజ్ఞగా నాగమండలమునఁ బ్రక టింపఁ జేయుమని మంత్రిందునికి వర్తమానము నం పుము. "వాసుకి సార్వభౌముని రాష్ట్రమునందు ఆంధ్రు లకు విరోధముగా వర్తించువారికి మరణ దండనము విధిం పఁబడును."

శైత్యోపచారముల వలన మూర్ఛ తేఱి కపాల మాలిక కన్నులు విచ్చి చూచెను. వాసుకియు, కమలయు నితర రాజ్ఞులును పట్టపు రాణిని గాలిలోనికిఁ గొనిపోయి యచ్చట నొక హంసతూలికా తల్పమున శయనింపఁ జేసిరి.

ఆ సమయమున నాక్రందన ధ్వనిచేయుచున్న యొకనారీమణి విమానమున నాకసమునఁ గొనిపోఁబడుచుండెను. కమల తన భర్తనుగాంచి "నాథా! ఆ యేడుపు చూడఁగా నెవ్వతెయో యొక సుందరాంగి బలిమిని గొనిపోఁబడుచున్నట్లు కానవచ్చుచున్నది. మనవైమానికులను వెంటనే అటుప్రక్క కంపుఁడు" అని పలికెను. వల్లె యని వాసుకి తన విమానములను పైకంపెను.

# పంద్రెండవ ప్రకరణము.



శ్రీముఖ చక్రవర్తి పాటలీ పుత్రమునుండి వెలువడి వచ్చెను. సుశర్మచే కటకమున కంపఁబడిన సైన్యములు కళింగాధిపునిచే తుత్తినియలుగా ఖండింపఁబడి నశించెను. చేది దేశముమీఁది కంపఁబడిన సైన్యములు అచ్చటనే హతమయ్యెను. భట్టబాణుని మంత్రి ప్రయోగమువలన అమరావతినుండి శత్రుసైన్యములు పాటలీ పుత్రమువంక కనుపఁబడెను. అన్యదేశముల మీఁదికి సుశర్మ యంపిన చమూ సమూహములును పరాజయము నందెను. తన మంత్రీందుని యర్థశాస్త్ర సమ్మతమైన యుక్తి ననుసరించి సుశర్మ తన వాహినులలో నాలుగవ భాగమును మాత్రమే పాటలీపుర సంరక్షణార్థమై తనకడ నునిచికొని మిగిలిన మూడువంతుల సైన్యములను మగధరాజ్యమునకుఁ గడు దవ్వుల నున్న దేశముల కనిపినందున పాటలీపురి యరక్షితముగా నున్నదని యెఱిఁగి శ్రీముఖ సార్వభౌముఁడు దానిని ముట్టడించుట కదియే తగినయదనని తెలిసికొనెను. వెంటనే పెంపుడు పావురములు సార్వభౌముని లేఖను భట్టబాణుని కడకుఁగొని పోయెను. అమరావతినుండి యిరువదివేల యాంధ్రసైన్యములు పాటలీ పుత్రమునకు వచ్చెను. ఉపస్థాన, సంవర్తన, సంయమ, వధావధ, హస్తియుద్ధ, నాగరాయన, యుద్ధములం

దాటి తేటిన కుంజరయూథములును, వల్గన నీచైర్గత, లంఘన, ధోరణ నారోష్ట్రములను నౌపవాహ్యములం దద్వితీయముగా బనిచేయు హయరత్నములును, దండభోగమండలా సంహత ప్రదర దృఢకాసహ్య సంజయ స్థూలకర్ణ, విజయాదులగు నానావిధ సమరవిధాన విశారదములగు పదాతివర్గమును గలిగి, తమకు నమస్కరించినవారికి అభయమిచ్చు శాంత స్వభావులైన బ్రాహ్మణులతోఁ గాక, కేవల పౌరుష ప్రధాను లగు క్షత్రియులతోఁ గూడుకొన్నదై అమరావతి నుండి వచ్చిన తనసైన్యమును సార్వభౌముఁడు పరీక్షించెను. తనకుఁ జెందిన మూలబలమును, ధనమిచ్చి తెచ్చిన భృత బలమును, సంఘములకుం జెందిన శ్రేణులను నాతఁడు పరీక్షించెను. సర్వతో భద్రాది స్థిరయంత్రములును, పాంచాలికాది చరయంత్రములును, శక్తిప్రాసాదాది హలముఖాయుధములును, తాళచాపదారు శృంగాది కార్ముకములును, వేణు సారాది బాణవర్గమును, నిస్త్రింశ మండలాగ్రాది నిశిత కరవాలములును, పరశుపట్టిసాది ధారా యంత్రములును, యంత్ర పాషాణాద్యిత రాయుధములును నా సమయమున నాంధ్ర హస్తములనుండి ఝళిపింపఁబడుచు లోక భీకరముగా బ్రకాశించుచుండెను. ఔపవేణుకాది వల్గనములను కపిప్లుతాది లంఘనములను, మయూరాది ధోరణములను, భద్రాశ్వాది నారోష్ట్రములను శరభప్లుతాది నీచైర్గతములను జూపుచు హయవతంసము లా సమయమున సార్వభౌమునికి నేత్రపర్వ మొనర్చెను. ఇట్లు రథ గజ తురగ పదాతులనెల్ల సంశో

ధించి, వలయు సౌకర్యములనెల్ల వానికిఁగూర్చి, యుద్ధక్రియా విధానములను నిజ దండనాథులకుఁ దెలిపి, శ్రీముఖ రాజేంద్రుఁడు తనలో తా నిట్లాలోచించుకొనెను.

"ధర్మ మెప్పటికిని జయించును. అధర్మము బెడిసి కొట్టును! దేశ చరిత్రములును మనుష్య చరిత్రములును గూడ ఈ నీతికి తార్కాణమై యున్నవి. భట్టబాణుఁడును అపస్తంబుఁడును విద్యావిశారదులైన బ్రాహ్మణులు. భారవి మహాకవితో సమానమైన విద్య కలవాఁడై భట్ట బిరుదము నందినవాఁడు భట్టబాణుఁడు. పతంజలి మహర్షి యవతారమో యనునట్లు యోగ వ్యాకరణ శాస్త్రములకుఁ బుట్టినిల్లై దూరశ్రవణాది మహావిద్యల నలవఱచుకొన్న అపరిమిత యోగానుభవుఁ డీ యాపస్తంబుఁడు. యజుర్వేద ప్రయోగమునకు మూలకారణుఁడై యీతని పితామహుఁడే కదా తనపేర నాంధ్రులకు ఆపస్తంబ సూత్ర మొసగినకీర్తి విస్తారుఁడు. ఇట్టి మహనీయులు నాకు సహాయులై యుండఁగా ఆంధ్రులకు పరాజయ మెన్నఁడైన కలుగునా? క్షత్రియ జాతుఁడయ్యును తపః ప్రభావమువలన బ్రాహ్మణత్వము నంది, బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టి యొనరించిన విశ్వామిత్ర మహర్షి వంశమున నుద్భవించి, దాక్షిణాత్య భాషలకెల్ల నాదిమాతృకయగు నాంధ్రభాషను విరచించుకొని దేశ విఖ్యాతి గాంచి, త్రేతాంతము నాఁటికి దండకావనిని రాక్షస విము క్తము గావించి లోకమును అకంటకముచేసి, అటువెనుక నగస్త్యాశ్రమము పొంత దివ్య సర స్తీరమున నాంధ్రనగర

మును నిర్మించి యశముగాంచి, ఆ మహర్షి సత్తముని ద్రవిడ దేశమున కంపి మధురమైన మనభాషనందు మధురార్థమున వెలయింపఁజేసి అటువెనుక సార్వభౌమత్వమును వహించి లక్షోపలక్షుల రథగజతురగ పదాతులతో చంద్రగుప్త చక్రవర్తికి ప్రక్క బెదరై నిలిచి, ఉత్కలము నుద్ధరించి, విదర్భ, నిషధముల నధివసించి, గౌరవముగాంచి మించిన దీయాంధ్ర జాతియేకదా? సిద్ధనాగార్జునాద్యాయుర్వేద విధాయకులను, ఆపస్తంబాది శాస్త్ర విధాయకులను లోకమున కొసఁగిన యీ యాంధ్రజాతి యిప్పుడు నా చేతనున్నది. ఆంధ్రశబ్దము విన్నంతమాత్రనే మానవ హృదయమునందు గౌరవ ముప్పతిల్లుటకు నే నేమి చేయవలయును? ఆంధ్రజాతివారిని నమ్మనచ్చుననియు, వారికిఁగల సుగుణములును, ధీపటిమయు నద్వితీయములనియు లోకులెల్లరును జెప్పుకొన్న నేగదా నాకు గౌరవము? నీచమున కొఁడబడక అకార్యములను జేయక, పరమోపకారులై పవిత్ర వర్తనులై నేఁడును, ఎల్లకాలమును గూడ ఆంధ్రులు చరించునట్లు చేయుటకు నాకు సాధనము లెవ్వి? ఆంధ్రనామము పవిత్రమగుఁగాక. ఆంధ్రులెప్పుడును సుగుణాభరణులై బుద్ధివిశారదులై భోగభాగ్య సంపూర్ణులై విరాజిల్లుదురుగాక."

"ఆంధ్రశబ్ద గౌరవము నీకనైన నేను నిలుపవలెను." అని శ్రీముఖ చక్రవర్తియనుకొనుచున్నంతలో ఆపస్తంబుఁడు సార్వభౌముని కడకు వచ్చెను.

సార్వభౌముఁడును నాపస్తంబుని నుచితరీతిని గౌరవించి యుద్ధవిషయములను గూర్చి యాతనితో ముచ్చటించి తన యాలోచనము నాతనికి దెలిపెను.

ఆపస్తంబుఁడు యోచించి "సార్వభౌమా! చక్కగా నాలోచించితిరి. ఇట్టి సమర్థతయే మా కున్న యెడల ఇఁక సార్వభౌమత్వముతో విశేష మేమున్నది. ఇందువలననే ఏలికకు సార్వభౌమత్వమును మాకు తమసేవయు సిద్ధించినది. సింహము హీనమయిన పనులు చేయునా? సమయము వచ్చి నప్పుడు బుద్ధితో విజయము గాంచువాఁడే సార్వభౌముఁడు గాని తెలివిలేనివాఁడై ఇతరుల యాలోచనములకు వేచి యుండువాఁడు సార్వభౌముఁడా? ఏలిక కార్య నిర్వాహణశక్తి యద్భుతము గదా. తమ యోచనవలన మనకు రాఁబోవు గండము లన్నియు తప్పుచున్నవి. మనకు దిగ్విజయము సిద్ధమగుచున్నది. ఆంధ్రుల గుణగౌరవములకు వన్నెయుఁ వాసియుఁ గలుగుచున్నవి."

సార్వ :— ఆ విషయము లుండనీ. జాతిగౌరవము ఎప్పుడును దేనివలన సిద్ధించునో నీకు తెలియునా?

ఆప :—నీచమునకు దిగకుండుటవలన, సత్యమాడుట వలన, నమ్మకముగా చరించుట వలన.

సార్వ:—అవి యెట్లు సిద్ధించును?

ఆప :—సార్వభౌములే దానిని విశదీకరింపఁ గర్తలు.

సార్వ :—గౌరవముగాఁ ప్రవర్తింపుమని లక్షసారులు బోధించినను మనుష్యునికి గౌరవార్హమైన ప్రవర్తనము రాదు.

ఈ కలికాలమునందు ఈ జగమంతయు ధనమూలమై యున్నది. ధనము గలవాఁడే కులీనుఁడు, అధికుఁడు, ఆర్యుఁడు, ధీనిధి, ధన్యుఁడు, నేర్పరి. కేవల లోకవిరక్తి వలనను ప్రపంచము దుఃఖమయ మని భావించుకొనుట వలనను సుఖసంతోషములు కలుగవు. మనుష్యునికిఉన్నది తృప్తి. పసరమునకు తిన్నది తృప్తి.

ఆప :—దేవా! యుద్ధసమయమునందు క్రియలనుగూర్చిగదా మనము విచారింపవలసి యున్నది.

సార్వ :—ప్రతి కుటుంబమునకు అన్నవస్త్రములకు లోపము లేకుండు పాటి శాశ్వతమైన జీవనోపాధి యుండెనా అది దేశగౌరవమునకు ప్రథమావస్థ. ప్రతికుటుంబమును అంత కంటె నధికముగానే ధనమును బొందియుండెనా అదిఅంత కంటె నుత్తమావస్థ.

ఆప :—ఈ యుద్ధసమయమునం దీ విషయములు అంతము ఖ్యము కావుగదా ?

సార్వ :—ఈ సందేశమును నీవు వెంటనే భట్టబాణుని కంప వలసి యున్నది. ఆంధ్రదేశములో నెచ్చ టెచ్చట జలా శయములు కలవో యిదివఱకే నేను అతనికి తెలిపి యున్నాను. ఆ జలాశయముల పొంతనే పూర్వాంధ్ర రాజులు ప్రతి కుటుంబమునకును అవ్వారిగా వలసినంత భూమిని ఇచ్చియున్నారు. ఈ కాలములో భూములు లేని కుటుంబముల సంఖ్య విస్తారముగా నున్నది. ఇట్టి వారున్న స్థానములను తెలిసికొని వారికి వలసిన యేర్పా

టులను జేయుటకు నేను నిశ్చయించికొనియున్నాను. రాజు ప్రకటనముగా వెంటనే ప్రతియూరను అట్టి కుటుంబములకు ఆ నూతన భూములను ఒసంగవలసినదని భట్టబాణునికి వ్రాయుము. ఇందువలన నొక్కొక యాంధ్రుడును పొట్టకై నీచమునకు దిగవలసిన విపత్తులు లేని వాడై కొంతవఱకు ఉన్నత దశకువచ్చి గౌరవ సంపన్నుడు కాగలడు.

ఆప:——అట్లే చేయుచున్నాను. కాని సౌశీల్యముగదా అన్నిటికంటె నుత్తమ మైనది.

సార్వ:——ఆపస్తంబా - లెస్సగా చెప్పితివి. సౌశీల్యమనునది నోటిమాటలతో బోధించినందువలన కలుగదు. ప్రతిగుణమునకును ఆలంబన విభావమును, ఉద్దీపన విభావమును ఉండక మానవు. ధనికుడు వీధులయందు దొరలుచున్న చీకిగుడ్డ కాసింపడు. గోచిపాతకైన లేనివాడు ఆగుడ్డ ముక్కనే మహా భాగ్యముగా స్వీకరించును. సౌశీల్యమనునది సంఘధర్మము గాని మఱియొక్కటి గాదు. జనులు సంఘముగా జేరి నివసించుట వలననే వివాహములు సంఘధర్మములైనవి. ఇట్టి కట్టుబాటును మనుష్యులు చేసికోని యెడల, పలువురు పురుషులు ఒక్క కాంతకే యాసించి కొట్టుకొని చచ్చిపోవుదురు. జనులు సంఘముగా వసించునప్పుడు ఒండొరులశాంతతకు భంగము తెచ్చు కార్యముల నెవ్వడును బహిరంగముగా చేయలేడు. ఈ సంఘధర్మములను మీఱకుండ జనులు

సుఖపడుటకు వలసిన అమోఘ శాసనములను జేయునదే యుత్తమ మతము. పేదఱికమును దాటిన యెడల సంఘములో చెప్పకయే దోషభాగము నశించును. విద్యాధిక్యతచేత నది హెచ్చును. మతము వలన నది ఆభేద్యమగును. రాజ శాసనములు అట్టి సౌశీల్యమును వృద్ధి చేయును. ఆపైన నుత్తమ పదవులును, మహోద్యోగములును, మనుష్యుల సమర్థతను బట్టియుండును. ఆంధ్రదేశమునం దంతటను నుత్తమోత్తమములైన విద్యాలయము లనేకములు చిరకాలము నుండి మనము పెంపందింపఁ జేయుట కిదియే కదా కారణము. ఇప్పుడు మన మందు క్రొత్తగా చేయవలసిన దేదియు లేదు. కఱవు కాలములందును బధిరపంగ్వంధరోగపీడితులగు నితరుల యందును దయఁగలిగి ధర్మాన్న సత్రములు ఇందువలననే మన మేర్పరుచుచున్నాము. న్యాయపథమువీఱి చరించువారికి అమోఘములైన రాజ దండనలు ఇదివఱకేమన రాజ్యమునఁ గలవు.

ఆప :— సార్వభౌమా! భరతవర్షమునందలి జనులెల్లఱిలో ఆంధ్రులే అధిక గౌరవనీయులై, పరువు తెచ్చుకొనివచ్చుటనుగూడ శాంతముతోను సుగుణములతోను విరాజిల్లుచుండుట తమవంటి యేలిక బుద్ధివిశేషము మూలముననే కదా?

సార్వ :— దేశక్షేమమును బాటించుకొనుట మనవిధి. ఇంకనొక్కటి బౌద్ధులు దయాపూర్ణ హృదయులై పేదల కన్న

మిడియు, రోగులకు సమస్తోపచారములుచేసి మందు లిచ్చి కాపాడియు, లోకములో నెవ్వరికి ఆపదవచ్చినను నడుము కట్టుకొని నిలిచియు, ఎంతెంత మంచికార్యములను నరుఁడు చేయునో అంతకుఁ దగినట్లుగా నాతనిని ఉత్తమ బౌద్ధ లోకమున జేర్చియును బౌద్ధశబ్దమును ఉత్తమత్వమునకుఁ బర్యాయ పదముగా జేర్చియున్నారు.

ఆప :—దేవా ! దేవరమాట కడ్డము వచ్చుచున్నాను. కనక వల్లినిఁ బలిమిని బట్టితెచ్చుటకై నిన్నటిదినమున సుశర్మ తన విమానమువిూఁద మైత్రేయుని బంపినాఁడట ?

సార్వ :—ఏమీ ? కనకవల్లినా ? అక్కటా ! దుష్టాత్మా ! నా మనో నాయకినే వంచించి తేఁదలఁచినావా ! పూర్వ మూ సీతను గొనిపోయిన రావణుని గతియే నీకును రా నున్నది కాఁబోలు ! పుత్రమిత్రసహితముగా నీవునశింపఁ గలవు. కనకవల్లి యెప్పటి కిక్కడకు రాఁగలదు.

ఆప :—మహా నవమినాఁటి రేయి నిశీథమునకు సంకేత మం టపమున కామెను గొనిరమ్మని యా పాతకుఁడు మైత్రే యున కాజ్ఞాపించినాఁడు.

సార్వ :— ఈమధ్యకాలమున మైత్రేయుఁ డెచ్చట నుండఁ గలఁడు.

ఆప :— దేవా ! అది తెలియదు. అందువలననే నేను మన చారులను గొందఱను వింధ్య పర్వతాభి ముఖముగాఁ బం పించినాను. మైత్రేయుఁడు మార్గమున నేయే చోట్ల దిగె నో, ఏమేమి సౌకర్యములను గూర్చుకొనెనో జేఁపటి

నుండియు మనకు వర్తమానములు రాఁగలవు. విషకన్యను ఈ సారంగము దారిని అంపింపు మని భట్ట బాణునికి వ్రాయుచున్నాను.

సార్వ:— మిత్రమా ! సుశర్మ దుష్టుఁడైనను మనము దుష్టులము కారాదు. మార్గమధ్యమున కొన్ని తావులలో వాఁడాగక మానడు. ఆ ప్రదేశములలో వెంటనే సైన్యములను ప్రచ్ఛన్నముగా నుంచుము. మహానవమినాఁటి సాయంకాలమునకు పాటలీ పుత్రము మనచేతిలోఁ బడవలెను.

-0——

# పదమూఁడవ ప్రకరణము.

"కనకవల్లీ ! కనకవల్లీ! ఇఁక నాకెక్కడి కనకవల్లీ ? రాజర్షియైన జనక రాజేంద్రుని పెరిమంపు బిడ్డవై యల్లారు ముద్దుగాఁ బెరిగి కులమునకు వన్నె తెచ్చు సుగుణములును, సుగుణములకు వన్నె తెచ్చు సదూపమును, రూపమునకు వన్నె తెచ్చు లావణ్యమును గలిగి విద్యా సరస్వతివై వెలుఁగందు నిన్ను పలుబాముల పాలుచేసి, మహారణ్య మధ్యము నందు నివాసమేర్పఱుప వలసి వచ్చినదా ? చిన్ననాఁటి నుండియు నీ గుణవాసనల కానందించి, నిన్నే వరించి, తుట్టతుదకు జనక రాజేంద్రుని యనుమతి వడసి, వివాహ ప్రియత్నము లన్నియుఁ గావించి. యిఁక నీవు నాపాలి భాగ్యరాశి వగుదువు గదా యని సంతోషించుచుండఁగానే యెంతటి యెగ్గు వాటిల్లినది ? ఆనాఁడు నే నట్లు వేఁట తమకమున నా యరణ్యముల కేలఁ బోయితిని ? మృగయా వినోదము దుర్వ్యసనములలో నొక్కటి యని తెలిసికూడ, అట్లడవికి పోయిన పాపాత్మునికి ఇక్కట్టులు రాక మానునా? పోయితినిపో! ప్రాణ భితిచే పాఱిపోవుచున్న యా మాయలేడి యుసురులు తీయఁబూని నా పరివారమును విడిచి నే నేల దూర మరుగవలెను ? ఇట్లు ఏ కాకినై కుమ్మరుచు నీ సుశర్మ హాతకుని చేతఁబడి, రాజ్యముపోఁగా ఆశయము లడుగంటగా,

ప్రచ్ఛన్నముగా శత్రుపురమున నే నిట్లు వసింప వలసి వచ్చి నదా? ఇంతలో నీ దురాత్ముఁడు జనక రాజర్షి నే సంహరించి కామాంధుఁడై నిన్నే హరింప వలెనా? అంతయుఁ గడచినది పో! ఋష్యశృంగు నాశ్రమమునకు విమానముతో మైత్రేయుఁ డంపఁ బడినాఁడని ఆపస్తంబుఁడు చెప్పినప్పటినుండియు నా మనస్సు కడు సంచలించుచున్నది. శ్రీముఖ చక్రవర్తియే తనకు ప్రాణమని నమ్మి తండ్రి మరణమునకైన సహించి నన్ను రక్షించుటకై పాటలీపురికి చేరిన కనకవల్లి మైత్రేయుని చేతఁ బడనుండఁగా, పిఱికిపందనై నే నీ చోట కూరుచుండ వలసి వచ్చినదా? మగధరాజ్య మెటు పోయినను పోనీ! ముందుగా నేను కనకవల్లిని కాపాడి, ఆ వెనుక నే సుశర్మ హాతకునిపై పగతీర్చుకొనవలెను. ఒక్క క్షణమైనను ఆలస్యము చేయరాదు.

అట్లు నిశ్చయించుకొని శ్రీముఖ చక్రవర్తి పాటలీపుత్రమున జరుప వలసిన పనుల నన్నింటిని ఆపస్తంబునికి విశదముగా తెలిపి యొక్కసారి తన సైన్యముల గలిసికొనెను.

"జయ శ్రీముఖ చక్రవర్తీ" అని ఆంధ్ర సైనికు లందఱును ఒక్కసారిగా జయజయ ధ్వానములుచేసిరి. చక్రవర్తి తన సైన్యముల నన్నింటిని తిలకించి వారి కుత్సాహమును బురికొల్పి వేఁగరులను రప్పించి మైత్రేయుని పోకడను గూర్చి విచారించెను. అందొక వేఁగరి "సార్వభౌమా! ఈ నవమి నాఁటికి కనకవల్లి పాటలీ పుత్రము చేరఁ గలదు.

ఆతఁడు మార్గ మధ్యమున నెచ్చటను ఆఁగకుండనే తిన్నఁగా పాటలీ పుత్రము చేరునని తెలియ వచ్చుచున్నది. ” అని చెప్పెను.

రాజేంద్రుఁడు సేనానితోఁ గొంత తడవు రహస్యాలోచనము చేసెను. “దండనాథా! కనకవల్లిని గొని తెచ్చుటకై యా దురాత్ముఁడు మైత్రేయుఁడు ఋష్యశృంగు నాశ్రమమున కేగేనాడు. వాఁ డెట్లైనను బలిమిని అమెనుఁ గొనిరాక మానఁడు. మునీంద్రుఁడు కడుసాత్త్వికుఁడు, లోకమాయల నెఱుఁగఁడు. దారిలో నడ్డగింత మంటిమా ఆతఁడెందును విడియఁడని తెలియుచున్నది. విమానములో నడ్డగింత మంటిమా, ఆ దుష్టుఁడు పరాజయము వచ్చినప్పుడు కనకవల్లికి ప్రాణహాని కావింపఁగలఁడు. వాని విమానము పాటలీపుత్రము సొచ్చునప్పుడు శతఘ్నులతోఁ బడగొట్టుద మంటిమా కనకవల్లికే అపాయము రాఁగలదు.. కాఁబట్టి పాటలీ పుత్రమును ఈ నవమి లోపలనే మనము జయించి సుశర్మను బంధించి యుంచవలెను. ఇందుకు మనకు సైన్యములు చాలవు. అందువలన కొన్ని సేనల నిక్కడకుబంప భట్టబాణునికి నాజ్ఞ నొసంగితిని. పాటలీ పుత్రమునుండి యొక్క మాగధునిగూడ వెలు వడనీ కుండ కట్టుదిట్టముచేసి, ముట్టడించిన యాంధ్ర సైనికులను దశమివఱకును నీ యూరి బైటనేయుంచి, భట్టబాణుని సైన్యములతో నీవు రహస్య మార్గమున కోటలోనికిఁ జొచ్చి రాజును జెఱపెట్టి, రాజ మందిరములను మనస్వాధీనమునం దుంచవలెను. అప్పటికినిగాని కనకవల్లిని మనమురక్షింప

లేము. మైత్రేయుఁడు పాటలీ పుత్రములోని విషయముల నెరుఁగనివాఁడై అనుమానము లేకుండ కనకవల్లి విమాన మును తిన్నఁగా సుశర్మ సంకేతమందిరమునందే నిలుపునట్లు మనము చేయవలెను."

దండనాథుఁడు కేలుమోడ్చి "సార్వభౌమా! దేవర యాజ్ఞలను శిరసావహించుచున్నాను. కాని సమయ మెట్లుం డునో! ఇంతకును ధర్మము మన పట్టున నుండగా మన కేమి భయము? శరీరబలముకన్న మనోబలము అధికమైనది. మనోబలము కంటె ధర్మబలము పెద్ద. ఈశ్వరుఁడు ధర్మము నకు తప్పక తోడగునని నిజముగా నమ్మువారికి ధైర్యోత్సా హములును, బుద్ధి బలమును కోటి మడుఁగులు అతిశయిం చును. దేవా! దేవుడు మనపాల నున్నాఁడు. ధర్మము మన పట్టున నున్నది. కాఁబట్టి నే నీ కార్యమును నెఱవేర్పఁగల నని ధైర్యముగా చెప్పఁగలను."

సార్వభౌముఁడు సంతోషించెను. ఇంతలో వేఁగరి యొక్కఁడు వచ్చెను. "సార్వభౌములకు వందనములు." అని చెప్పుచు వాఁడు శ్రీముఖుని పాదపద్మములకు సాష్టాంగ ప్రణామ మాచరించెను.

సార్వ:—ఓరీ సమాచారము లేమి?

వేగ:—సార్వభౌమా! పరాకు. ఏలిక యానతిచొప్పున మంత్రీంద్రుఁడు పదివేల సైన్యముల నిచ్చటి కంపినాఁడు. వా రిచ్చటికి నాలుగు గడియల దూరములో నున్నారు. అమరావతీ పట్టణము తక్క తక్కిన యాంధ్ర పురము

లన్నిటిని మాగధులు ధ్వంసము చేసినారు. వారిమీఁదికిని సైన్యములు పంపఁబడినవి. మైత్రేయుఁడు ఋష్యశృంగు నాశ్రమమువంక కరిగినట్లు విని మంత్రిం మిత్రుఁడు తానే స్వయముగా విమానారూఢుఁడై యటు తరలినాఁడఁట! అమరావతీ పురము అభేద్యమగుటచే నచ్చట ప్రకృతమున శత్రుభయములేదు.

సార్వ:- కనకవల్లి విషయమై ఏమేమివార్తలు వచ్చినవి?

వేగ:— మహాప్రభూ! మైత్రేయుఁడు పల్లెలలో దిరిగిఋష్య శృంగు నాశ్రమమునకు దారి యడుగుచు విమానా రూఢుఁడై యటు చను చున్నట్లు మాత్రము తెలిసినది. ఇంతకంటె వేరేదియు తెలియలేదు.

సార్వభౌముఁడు సేనానితో యోచించెను. "కనక వల్లిని శత్రుహస్తములనుండి విడిపించుటకై నేను వెంటనే బయలుదేరవలెను." అని యనుకొనుచు తగిన సన్నాహములు చేసికొని విమానారూఢుఁడై యాతఁడు ఋష్యశృంగు నాశ్రమము వంకకు వెంటనే బయలుదేరెను.

-0-

# పదునాలుగవ ప్రకరణము.

భట్టబాణుఁ డట్లు అమరావతి నగరమునుండి బయలు దేరి తిన్నగా నాగపురమువంక కరిగెను. "ఆవల శరవేగమున పోయి మైత్రేయుని నడ్డగింపవలెను. ఈవల సార్వభౌముని యాజ్ఞానుసారముగా వాసుకి నాగేంద్రునియెడల సామదాన భేదములలో వలసినదానిని, బ్రియోగించి యాత్రనిని మాగధుని నంకనుండి మనవంక కాకర్షింపవలెను. నాగలోక మంతయు మనకు సహాయము చేయునేని కనకవల్లిని మనము రక్షించినట్లే. ఈ మహామహీ మండలములో నొక్క భట్టబాణుని విమానము మైత్రేయుని విమానము నెట్లు తెలిసికొనఁగలదు. నేనొకదారినిఁ బోవునప్పటి కా విమానము మఱియొక దారిని పాటలీపుత్రమును సమీపించుచుండరాదా? ఎట్లామెను నేను వెదుకఁ గలను? నాకేమి సాధనము? వాసుకి చక్రవర్తియే నాకిప్పుడు శరణ్యము. అతఁడు ధర్మశీలుఁడు సుగుణాలవాలుఁడు కాని బౌద్ధపక్షపాతి." ఇట్లనుకొనుచు భట్టబాణుఁడు నాగపురిలో దిగెను. ఈ విమానము దిగిన తావునఁ గొందఱు మనుష్యులు నిలిచియుండిరి. విమానము శబ్దమును విని వారు భట్టబాణుని కడకువచ్చి "ఓయీ! ఏయూరు నీయది?" అని యడిగిరి.

భట్ట :—నేనొక యాత్రికుఁడను. నర్మదామూల స్థానమున కరిగిన బొద్ధులను గనఁగోరి యటకు జనుచున్నాను. ఇది యేయూరు ?

ఒక :—ఇది వాసుకి రాజేంద్రుని నివాసమైన నాగపురము.

భట్ట :—ఓహో ! వాసుకి సార్వభౌముడా ? ఆతఁడు దిగంత విశ్రాంతకీర్తి. ఆతఁ డీపురముననేనా యుండునది ?

ఒక :—అవును. కాని యాత, డిప్పు డిచ్చుటలేఁడు. దండ కావనిలో నున్నాఁడు.

భట్ట :—ఏమి ? వేఁటాడఁబోయెనా ?

ఒక :—అట్టిదే ! సుశర్మ హతకుఁ డీనడుమ కపాలమాలికను హరించుకొని పోఁగా నామెను విడిపించి తెచ్చి, ఇప్పుడు దండకావనిలో నున్నాఁడు.

భట్ట :—ఏమి ? సుశర్మయా ? మగధరాజు కాఁడో అతఁడు. అతఁడు వాసుకి సార్వభౌమునకు పరమ మిత్రుఁడే కదా !

ఒక :—అవి వెనుకటి మాటలు. ఇప్పు డాతఁడు చక్రవర్తికి గర్భశత్రువు. మైత్రేయుఁడు కపాలమాలికను ఎత్తుకొని పోవుచుండఁగా చక్రవర్తి యామెను విడిపించినాఁడు కాని యా మైత్రేయుఁ డెట్లనో తప్పించుకొని పాఱిపోయి నాఁడు. కపాలమాలిక మాత్రము మూర్ఛనంది తఱువాత చక్రవర్తి శైత్యోపచారముల వలన తెలివందియు, ఇప్ప టికిని ఆరోగ్యము చెడియున్నది. అందువలన వైద్యా ర్థమై యాతఁ డామెను మూలికాక్షేత్రమునకు గొనిపోయి యచ్చటనే విడిసియున్నాఁడు.

"ఆహా! నాకిది శుభవర్తమానము. వెంటనే వాసుకి నాగేంద్రునిఁ దర్శించి, మైత్రేయుఁడే కనకవల్లిని తేనరిగినాఁడని చెప్పి నాగులవిమానములను దారులన్నిటియందును నిలుపునట్లు చేయవచ్చును. ఆంధ్రదేశముపై దాడివెడలిన మగధసేనలను నాగేంద్రుని సహాయమునవలన నిముసములలోనే నిర్మూలము చేయవచ్చును." అని యనుకొనుచు భట్టబాణుఁడు మూలికాక్షేత్రము వంకకుఁ బోవుటకై తన విమానము నెక్కఁ బోవుచుండెను.

ఒక :—ఓయ్యీ! నీ వెవ్వఁడవు? ఇచ్చట విడియఁ బోవుచు నేల మా మాటలు వినఁగానే పాఱిపోవుచున్నావు? నిలు నిలు? మమ్ములను తప్పించుకొని పోవుట నీ తరమా?"

భట్ట :—ఓయీ! నేను ఆంధ్ర చక్రవర్తికి రాయబారిని. నాగేంద్రుని దర్శించుటకై వచ్చినాఁడను. అవశ్యమైన పనికలదు. మైత్రేయుఁ డిప్పుడు జనకరాజర్షి కూఁతురగు కనకవల్లిని చెఱఁ గొనుటకై నర్మదా తీరభూముల కరిగినాఁడు. నాగేంద్రుని సహాయముతో ఆమెను పాటలీపుత్రము చేరకముసుపే మనము కాపాడవలెను. నీ వీ విషయమును మీ దండనాథునకుఁ జెప్పి సర్వమును సిద్ధము చేయింపుము. అని చెప్పుచు భట్టబాణుఁడు ఆకసమున కెగసిపోయెను.

అట వాసుకి నాగేంద్రుఁడు స్త్రీయొక్క యాక్రందన ధ్వనిని విని విమానమును పైకంపి, తన రాణులతోఁగూడ నాకసమువంకఁ జూచుచుండఁగా నింతలో నాంధ్రుఁడైన

రాయబారి యొక్కఁడు రాజేంద్రుని దర్శించి, "దేవా! ఆంధ్ర చక్రవర్తియగు శ్రీముఖ నరనాథుఁడు ఏలికను బహూకరించి, కట్నము లంపి యీ లేఖను తమ కందఁజేయ నాజ్ఞ యొసంగినాఁడు. బౌద్ధధర్మములకు అడ్డుపెట్టక, తన రాజ్యమున బుద్ధుని యారాధనమునకు సమస్త సదుపాయములను బనర్చినాఁడు." అని చెప్పెను. నాగేంద్రుఁడా లేఖను జదువుకొని,

"ఓయీ! సార్వభౌముఁడు మా కెప్పుడును ధర్మస్వరూపుఁడు. ఆతఁడు మాకు మనవి చేయవలసిన దెద్దియు లేదు. మే మెప్పుడును ఆతని యాజ్ఞానువర్తులమై చరించువారము. ఆయన యిష్టానుసారముగా మారాజ్యమున నరులను భక్షించు నాచారము మాన్పఁబడినది. సమస్త సైన్యములను సిద్ధము చేసికొని యున్నామనియు, ఏ క్షణమున నెట కరుగుమన్నను బయలుదేర నాయత్తముగా నున్నామనియు సార్వభౌమున కెఱిఁగించునది."

ఇంతలో ద్వారికుఁ డచ్చటి కరుగుదెంచెను. "దేవా! ఆంధ్ర చక్రవర్తి మంత్రియగు భట్టబాణుఁడు ఏలికను దర్శింపఁ గోరుచున్నాఁడు." "ఓయీ! ఇచ్చట పీఠము నమర్చి యా మంత్రిని అతి వినయముతో సగౌరవముగాఁ గొనిరా."

భట్టబాణుఁ డరుగుదెంచెను. వాసుకి నాగేంద్రుఁడు ప్రీతుఁడై "ఏ మంత్రీంద్రుని యద్భుత ప్రభావమువలన ధర్మములు నిరాఘాటముగా వర్తిల్లుచున్నవో, ఏ సచివసత్త

ముని యుదార ప్రజ్ఞవలన శత్రువిజయము అమోఘముగా చేకూఱుచున్నదో, అట్టి భట్ట బిరుదాంచితుల కిదే సాష్టాంగము. దేవా ! ఆ పీఠమున నధివసించునది."

ఆసీనుఁడై భట్ట బాణుఁడు " దేవా ! ఏలికకు సౌఖ్యమే కదా?" "మంత్రీంద్రా ! తమ కటాక్షమువలన సుఖము గాక వేఱేమున్నది. కాని యామగధహాతకుఁడు మన కపాలమాలికనే చెఱఁగొన దలఁచినాఁడు."

భట్ట :—వింటిని సుశర్మహాతకుని దౌర్జన్యమును ఏలికయొక్క యనంతర విజయమును. దేవా! నేనిప్పుడు కార్యార్థినై వచ్చితిని. నాకార్యపు వేగిరపాటువలన ప్రతిక్షణమును నాకమూల్యమైనదిగా నున్నది. రాజకార్యము లటుండనిండు. ఆమైత్రేయుఁడీ జనకరాజర్షి కుమారితయగు కనకవల్లిని వింధ్యాటవులనుండి హరించితెచ్చి సుశర్మకీఁ బోవుచున్నాఁడు. రాజకీయవ్యాపారము లెట్లున్నను, పరనారుల నపహరించుపట్టున ఏలికవంటి ధర్మావతారులు జోక్యముతీసికొనకతప్పదు. ఇతర విషయములను మనము తఱువాత యోచింపవచ్చును. ఏలిక యను గ్రహించి వెంటనే వైమానికులను దండకారణ్యము దశదిశలకంపి—"

వాసు :—ఏమేమీ? వంచకుఁడైన సుశర్మ కనకవల్లీమతల్లినే అపహరింపఁబోవుచున్నాఁడా ? జనకరాజర్షి పెరిమంపు బిడ్డను శ్రీముఖ సార్వభౌముని భావిభాగ్యరాశిని, ఆంధ్రుల నోముపంటను, కల్యాణగుణాలయను కనకవల్లిని హరింప మైత్రేయునిఁ బంపినాడా? మంత్రీంద్రా ! ఏమి

యాదురంతము ? ఏమీ యీకలికాలమహిమ? ఈమ
ష్యుఁడే కదా జనకరాజర్షిని సర్వదృష్టుని గావించి కనకవల్లిని
మున్నొకసారి యెత్తుకొని పోయినవాఁడు. దేవా? శ్రీముఖ
సార్వభౌముని కాఁబోవు నిల్లాలినా? ఇదె నాగమండలము
ననే విమానమరిగినను నాకడకు రప్పించుచున్నాను. దా
వారికా! వెంటనే నాయాజ్ఞలను దేశమంతటను జాటిం
పించుము. ఇచ్చట నున్న విమానముల నన్నింటిని ఆకస
మున కెగయనిమ్ము."

భట్ట :—"రాజేంద్రా! కృతజ్ఞుఁడను—"

వాసు :—మంత్రీంద్రా! తామట్లు వచింపఁజనదు, ఇదే సకల
సన్నాహములు క్షణములో కాఁగలవు. ఇంకను మాకేమి
యాజ్ఞ ?

భట్ట :—రాజేంద్రా! తమ సహాయము మాకుండఁగా మా
కేమి కొదువ? మీ కరుణవలన మా రాజేంద్రుఁడు
సుశర్మను జయించెననియే మేము భావింపవలసియున్నది.

వాసు :—సుశర్మనా? వానిని జయించుటకాదు. ఆ పరమ
పాపాత్ముని ఆ పరమనీచుని, ఆ పరస్త్రీ వంచకుని యేమి
చేసినయెడల నాకోపము తీరునో ?

భట్ట :—దేవా! ఇంకొక్క సహాయము. మాగధు లాంధ్ర
దేశముపైబడి పట్టణములను పల్లెలను నిర్మూలము చేయు
చున్నారు. ఊళ్ళన్నియుఁ గాల్చి వేయఁబడుటచే ఆంధ్ర
దేశమునకు దగ్ధరాష్ట్రమని పేరు వచ్చుచున్నది. తమ
సైన్యములీ సుశర్మహతకుని సేనలను,—

వాసు :—ఇదె ఈక్షణముననే నేను సమస్తసైన్యములతోఁను బయలుదేరి ఆంధ్రదేశము మీఁదికి దాడి వెడలిన మగధ సైన్యములను నిర్మూలముజేసి శ్రీముఖ చక్రవర్తి మైత్రికి పాత్రుడఁను కాఁగలను.

భట్ట :— దేవా ! మాగధుల వ్యూహము లీ పటము వలన—

వాసు :— ఏమేమీ ? ఎన్నెన్ని భాగములై వీరు దేశ నాశనము చేయుచున్నారు ? అక్కటా ! ఎంతదేశము దగ్ధ రాష్ట్రమై పోయినది ? ఓరీ ! సుశర్మా నీకు పోఁగాలము దాఁపరించినది. మంత్రీంద్రా ! ఇదే నాకు ముదలయిమ్ము. నేఁడే నేను ప్రయాణ మగుచున్నాను.

కమల :— నాథా! అదె యిందఱు వైమానికులను తప్పించుకొని ఆ విమాన మెట్లరుగుచున్నదో ?

భట్ట :— దేవా! నే నా విమానమును జూడవలెను.

నాగేంద్రుఁడును భట్టబాణుఁడును విమానమెక్కి ఆకసమున కెగసిరి.

—0—

# పదియైదవ ప్రకరణము.

అట్లు కనకవల్లి హాహుమని యేడ్చి విమానమునందు వ్రాలఁగానే వాసుకి నాగేంద్రునిచే నంపఁబడిన మొదటివిమానమువచ్చి దాని నడ్డగించెను. ఆకస్మికముగా నాగ విమానమువచ్చి తన్నడ్డగించుటచే మైత్రేయుఁడు భీతిల్లెను. నాగుల సారధి కఱకైన బాణములను ఆతనిపైకి విసరెను. అందొకటి మైత్రేయుని శిరస్సును దూసికొని పోయెను. భయగ్రస్తుఁడై మైత్రేయుఁ డొక మూలకుఁబోయి దాఁగుకొనెను. అంతట నాగరాజేంద్రుని సారధి "ఓయీ పూర్వమున కృప ద్రోణాశ్వత్థామాదులు బ్రాహ్మణులయ్యును, శస్త్రాస్త్రవిద్యాగురువులైరి. భారత మహాయోధయైన అర్జునునకు సహితము ద్రోణుఁడు దుర్జయుఁడై యుండెను. పరశురాముడు బ్రాహ్మణజాతుఁడయ్యును లోకములో సమస్తక్షత్రియులను పరాభూతులను జేసెను. ఇట్టి నీబ్రాహ్మణవీర్య మెచ్చటికిఁబోయినది? నీది పుట్టుబ్రాహ్మణత్వముగాని పసగల బ్రాహ్మణత్వము కాదు." అని పలుకుచు పది వాడినాసనముల నాతనిదెసకు బఱపించి యాతఁడు కనకవల్లి విమానమును డగ్గఱెను. "ఓయీ ! కాలములు మాఱినవి. క్షాత్రము రజోతామస ప్రధానము. అందు శుద్ధ సత్త్వము లేదు. సాత్త్వికమైన శాంతము బ్రాహ్మణునకు పరమధర్మము. శాంతము సమస్త

దుఃఖ నివారకము. కష్టములనుండి తరించుటకదియె పరమ సాధనము. మోక్ష సంప్రాప్తి కది ప్రధానమార్గము. పర హింస పరమపాతకము. నీ యుత్తమ బౌద్ధధర్మముగూడ నిదియే. నీవు బౌద్ధుఁడనయ్యును, నిట్లు పాపమున కొడిగట్టి బ్రాహ్మణుని హింసింపఁ బూనుట రౌరవాది నరకముల పాలగుటకే సుమీ? రా." అనుచు మైత్రేయుఁడు తన విమానము నతివేగమున మఱియొక దెసకుఁ బఱపి పాఱిపోఁ జూచెను. "ఓరీ! బ్రాహ్మణ నామధారీ! నిలు నిలు. ఇంతటి ధర్మశీలుఁడవు కావుననే పరాంగనను బలిమినిఁగొనిపోవు చుంటివి!" అని పలుకుచు నాగసారథి మరల మైత్రేయుని నడ్డగించి విమానమును ఆఁపివేసెను. ఇది చూచి మైత్రేయుని సఖుఁడైన చేటకుఁడు నాగసారథి విమానము దగ్ధమగునట్లుగా దానిపై నాగ్నేయాస్త్రమును బ్రయోగించెను. "ఇదె! ఆగ్నేయాస్త్రము! దీనితో నీబౌద్ధధర్మ ప్రభావము బైటఁ బడును. కాచికో." నిప్పులు రాల్చుచు, పొగలుఁ గ్రక్కుచు, భీకరముగా ఘోషము చేయుచు నాయాగ్నేయాస్త్రము సూటిగా నాగ విమానము మీఁదికి వచ్చుచుండెడు. నాగ సారథి దానినిఁజూచి యించుకేనియు భయమందక తనవిమానములోని యొక మీటను నొక్కెను. దానితో నా విమానము మఱింత పైకెగసెను. ఆగ్నేయాస్త్రము గుఱి తప్పిపోయి, నాగ విమానమునకు రెండుగజముల క్రిందుగా వేగముతో వెడలిపోయెను. "ఓరీ ? నీ విమానమునందా నారీమణి లేనియెడల ఈపాటికి నీపని యేమగునో. నిలు నిలు."

అని పలుకుచు నాగసారథి శత్రుసారథి వక్షమును పగల్చెను. రక్తము గార్చుచు వాఁడు నేలఁబడి చచ్చెను. ఇంతలో భూమినుండి అనేక విమానములు పైకి లేచుచుండెను. అది చూచి మైత్రేయుఁడు శీఘ్రముగ పైకి విమానమునునడపి, యొక పర్వతము చాటునకుఁ బోయి యటనుండి తప్పించుకొనివెడలి పోయెను.

మైత్రేయుఁ డిట్లు తప్పించుకొనుటను జూచి కనకవల్లి తన కిఁక యాసలేదని తెలిసికొన్నదయ్యును ధైర్యమవలంబించి మైత్రేయుని వంక వీక్షించెను. ఈ విమానమునం దింకను నాకు ఆర్గురు శత్రులున్నారు. వీరందఱును శస్త్రాస్త్ర విద్యా పారంగతులై సాయుధులై నాకుఁ గావలి కాచుచున్నారు. కాఁబట్టి వీరిని జయించుట దుర్ఘటము. అయినను ఉపాయము నకు మించిన పరమసాధన మెద్దియు లేదు. ప్రయత్న పూర్వక ముగా నీదుష్టులను నేను సంహరింప లేనా? ఈ విమానమం తయు కఱ్ఱతోను లక్కతోను జేయబడినది. దీనికి నిప్పంటించి తినేని వీరీ విమానమును క్రిందికి దింపక తప్పదు. క్రిందికి దిగు లోపుననే ప్రాణభీతి వచ్చునా? రానిమ్ము! ఇట్లు పరాభూతి నందుటకంటె మరణించుటయే సర్వశ్రేయోదాయకము. ఒక వేళ సురక్షితముగా క్రిందికి దిగితినేని అప్పటిమాట చూచు కొనవచ్చును." అని తలంచుచు కనకవల్లి వెంటనే తనచేతి చెకుముకిని ఇనుముతో మీటెను. నిప్పురవ యొక్కటి యం దుండి మెఱసెను. సంతోషించి యా సుందరాంగి "ఇదియే

సమయము, ఈపక్క కెవ్వరును రారు. ” అని తలంచు కొనుచు చెకుముకి రవలను విసుకు విరామములేకుండ, విమానముయొక్క ప్రక్కబల్లపైఁ బఱపెను. ఆయతుకు సందున నుండు త్రాడు క్రమముగా నల్లఁబడెను; పిమ్మట నది నిప్పయ్యెను. ఆ నిప్పున్న తావున నొక గోయియయ్యెను. విమానపుగోడలో నొక రంధ్రమయ్యెను. గాలి విసరున నారంధ్రము నుండి మంట లేచెను. క్రమముగా పొగలెగసెను. మైత్రేయాదు లా పొగను జూచి విమానము నిప్పంటుకొన్నదని గ్రహింపఁ జాలిరి. కలజలముల నా మంటలపైఁ గ్రుమ్మరించిరి. కాని యప్పటి కప్పుడే యా మంటలు భయంకరములై యార్ప నశక్యము లయ్యెను. మైత్రేయుఁడు తన మిత్రులను జూచి, “ఓయీ! ఘోరమైన ప్రమాదము వాటిల్లినది. నాగరాజు విమానములు మనపై విడిచిన నారసములమహిమ కాదేని యీనిప్పు పుట్టుటకు కారణము కానఁబడదు. మన మిప్పు డెట్లైన క్రిందికి దిగక తప్పదు గదా. ఆ మూల ఆగ్నేయాస్త్రము లన్నియు నమర్పఁబడియున్నవి. ఈ నిప్పు సెగలు వానికి సోకెనేని మనకు ప్రాణభయము నిక్కువము. కాఁబట్టి వెంటనే వానిని నేలఁ బడవేయుము.”

అస్త్రము లన్నియుఁ బరిత్యజింపఁ బడెను. విమానము నేలమీఁదికి దిగుచుండెను. అప్పుడు శస్త్రాస్త్ర విద్యాపారీణ యగు కనకవల్లి శూలపాణియై పైకిఁ గవసి క్షణకాలములో మైత్రేయుని తక్క తక్కిన వారిని గాటముగాఁ బొడిచి యమసదనమున కంపెను. “మైత్రేయా! నీవు బ్రాహ్మణుఁడవు.

ఘోరపాతకు లయ్యును బ్రాహ్మణులు వధ్యులు గారు. నీవు బ్రతికితివి పో. ”

విమాన మింతలో నేలకుఁ దిగెను. ఆకసమునఁ గొంత దూరమున వీరి కెదురుగా వేఱొక విమానము వచ్చుచుండెను. దూరమున బాగ లెగయుచున్న యీ విమానము వారికిఁ గానవచ్చెను. ఆ విమానములోని యొక పురుషుఁడు “ ఓరీ ! ఆ ప్రక్క వచ్చుచున్న విమానమున కెద్దియోగొప్ప యాపద వాటిల్లినది. పో శరవేగముతో నటుప్రక్కకుఁ మన విమానమును బోనీ !”

కొంతదూరము వీరు వచ్చుసరికి ఫెటిల్లు ఫెటిల్లుమని కఠోరములైన శబ్దములు వీరికి వినవచ్చెను. “ అదే. ఆగ్నేయాస్త్రములు నేలఁబేలి భూమినంతను కంపము నందించుచున్నవి. ఇట్టి యమోఘ బాణములు కలవాఁడు సుశర్మయొక్కఁడే కావచ్చును. అదిగో ! ఆ బాణము తగిలి యా పర్వత మెట్లు ఛేదిల్లుచున్నదో ! పద ! పద మన మా విమానమును గాపాడవలెను.

మఱికొంత సమీపమునకు వచ్చునప్పటికి ఆ విమానమునందొక సుందరాంగి మాఱ్ఱిన్పడి నిలిచియున్న కొందఱు యోధులపైకి దుముకుచుండుట కాననయ్యెను.

“ హా ! సుందరాంగీ ! కనకవల్లీ ! ఏమి నాభాగ్యము? ఏమి నా భాగ్యము ! కల్యాణీ! ఏ రమణీలలామను వెదకుటకై

నేనిట్లు పాటలీ పుత్రమును వెలువడి యిటు వచ్చితినో ఆ భాగ్యదేవత నా సహాయము లేకుండనే శత్రువిజయము గాంచినదా! కాంతామణి! నేను ధన్యుఁడను, కృతార్థుఁడను. ”

అని యఱచుచు శ్రీముఖ సార్వభౌముఁడు తన విమానమును కనకవల్లి విమానము దిగిన తావుననే క్రిందికిఁ దించి ఆమె యెదుటకుఁ బోయెను.

# పదియాఱవ ప్రకరణము.



లోకభీకరమైన మహాయుద్ధ మొకటి పొసఁగెను. రథనేమి ఘోషములతోను, హయహేషలతోను, నిభరాజముల ఘీంకారములతోను వీరభటుల హుంకారములతోను నా సమయమున నాంధ్రసైన్యములు కోలాహలముగా నుండెను. కటకాంధ్రకరూశ కోసలాద్యాంధ్ర దేశముల సైన్యములన్నియు నొక్క మొగి పాటలీపుత్రమును ముట్టడించెను. వెనుకకును ముందుకును నడుచుచుండు నాంధ్రసేనల సంచారములు అలలుగా, ధళధళమెఱయు నాంధ్రులశస్త్రములు మహామీనములుగా, శకటాదియుద్ధ పరికరములు మకరములుగా నొక్కయేటునఁ బరతెంచు సైనికనికాయముల యుఱవడులునాయు సంచలనములుగాఁ గ్రోధోద్భూతమై జాజ్వల్యమానమై మెఱయురోషాగ్నులు బడబానలముగా, మాగధ కంఠనిర్గతములైన రక్తములు నీరములుగా నాంధ్రవాహిని ప్రళయకాలాభీలమై పాటలీపుత్రము నొక్క నిమేషములో ముంచివేయునో యనునట్లు తోచెను. సుశర్మ రాజేంద్రుఁడు భయభ్రాంతుఁడై చేయున దెద్దియు లేక యంతఃపురము సొచ్చెను. మగధసైన్యములు పాటలీపురికోట గోడలపై నెక్కి యాంధ్రసైన్యములమీఁద కఱఁగించిన యినుమును గంధకమును సలసల మఱుగు నూనెలను విమ్మరింపసాగిరి. వాని నోర్వ

కొనుచు నాంధ్రసైన్యములు ఆగ్నేయాస్త్రప్రయోగములచేఁ గోటగోడలయందు వివరములు గావించి లోపలఁబ్రవేశించిరి. మదపుటేనుఁగులు కవాటములను ఛేదించెను. ఆంధ్రులు పాటలీపురిలోని కరిగిరి. అందెందుఁ జూచినను మాగధులే కానవచ్చుచుండిరి. ముందొక్క శిబిరము అంధ్రులచేతఁ బడెను. తఱువాత మఱియొక శిబిరము వారి వశమయ్యెను. కోటలోని యొకభాగమంతయు వారిచేతఁ జిక్కెను.

ఆంధ్రులమీదఁ గంపఁబడినఁ మాగధసైన్యములకు సుశర్మ వర్తమానము లంపెను. ఆంధ్రులా వార్తాహరులను దారిలోనే పట్టుకొనిరి. బైటినుండి సుశర్మకు సహాయము వచ్చునేమో యన్నభయ మాంధ్రులను బాధించుచుండెను. ఆపస్తంబుఁ డింతలో నాంధ్రధూతలవలన నవ్వలి సమాచారముల నరసి మగధసైన్యము లన్నియు వాసుకిచే హతమయ్యె ననియు ఆంధ్రులిప్పుడు పాటలీపుత్రములోని సైన్యములను మాత్రమే జయించినయెడల భరతవర్షమున కేకచ్ఛత్రాధిపతు లగుదురనియు సార్వభౌమునికి విన్నవించుచు

"రాజేంద్రా! శిశునాగవంశోద్ధారకుఁడైన వాసుకి చక్రవర్తి నిజసైన్యములతో ఆంధ్రదేశమందెల్ల కడలను సంచారములు సేయుచు, మగధసైన్యము లన్నింటిని నిర్మూలముచేసి ఏలిక కీ లేఖ పంపినాఁడు." అని చక్రవర్తి కొక లేఖ నొసఁగెను. దానిని చదివి చూచుకొని సంతోషించి సార్వభౌముఁడు "మిత్రమా? ఇప్పటికి ఆంధ్రరాజ్య మకంటక

మైనది. మనకు విజయము నిశ్చయమైనది. కాని యింక నొక్కటి గలదు.—" అని పలికెను.

అప:— సార్వభౌమా! ఎనిమిది శతాబ్దుల నుండి యీ మగధరాజ్యము శత్రువులకు ప్రక్క బెదరై భరత వర్ష మును ఏకచ్ఛత్రముగా పాలించుచున్నది. మనమీ నాలుగు శతాబ్దుల నుండియు వారితో సమానముగాఁ దులఁ దూగుచున్నను, నేఁటికిని పాటలీపుత్రము మన స్వాధీనము కాలేదు.

సార్వ: సర్వమును ఇప్పటికి సిద్ధమైనది. అలంఘ్యములైన యాపదలను దాఁటినాము. అపారమైన బలమును సంపా దించినాము. కోటలో పదివేలమంది యాంధ్రసైనికులను విడియించినాము. సుశర్మ మందిరమును గూడ ముట్టడించి నాము. ఆంధ్రరాజ్యలక్ష్మియగు కనకవల్లిని గొనితెచ్చి నాము. ఇఁక నీయుద్ధమేమి కానున్నదో?

అప రాజేంద్రా! రెండు దినముల నుండియు మన సైన్య ములు హోరాహోరినిఁ బోరుచున్నవి. రాత్రియంతయు నెవ్వరికిని నిద్రలేదు. కాని నేల యీనిన పోల్కిగా మగధసైన్యములు గడియ గడియకును పెచ్చుమీఱి పెరుగుచున్నవి. ప్రతి మాగధుఁడును యుద్ధ విద్యావిశా రదుఁడే. పాటలీపుత్రములోని పురుషు లెల్లరును ఇప్పుడు వీరభటులైనారు.

సార్వ:—అవును. ఈ సమయమున మన కింకొక పదివేల
మంది సైనికు లుండిరేని—అయినను ధర్మము మనపట్టున
నున్నది.

ఆప:—రాజేంద్రా! మన సైనికుల యుత్సాహమునకు
మేరలేదు. కాని సుశర్మయింటిని ముట్టడించిన సైనికు
లకు సహాయ మంపుటకు వీలులేకుండునట్లు మగధసైన్య
ములు అడ్డము పడినవి.

ఇంతలో యుద్ధభటుం డొక్కఁడు ప్రవేశించెను.
"దేవా! శర పరంపరగా మగధసైన్యములు మనశిబిరమును
జుట్టుకొన్నవి. బైటనుండి కోటను ముట్టడించిన యాంధ్ర
సైన్యములను గొని రమ్మని యాజ్ఞ నొసఁగుదునా" యని
యాపస్తంబుఁడు సార్వభౌముని నడిగెను. "వలదు. వలదు.
అది యేల? ఎప్పుడు వలసిననప్పుడే రప్పింపవచ్చును. సిద్ధ
ముగా నుండుమని సేనానికి వర్తమానము పంపుము" అని
రాజు పలికెను.

ఇంతలో శత్రుసైన్యములు ఆంధ్రశిబిరములో నొక
దారిచేసికొని దానిని రెండు భాగములుగా జీల్చివైచెను.
"రాజేంద్రా! ప్రమాదము. ప్రమాదము. మనము వెంటనే
వెడలి పోవలెను." "ఆపస్తంబా! ఏమి భయము? మనము
మందు దట్టించి యుంచిన నేలకడనే మనసైన్యములు ఉపాయ
ముగా చీలిపోయినవి. రానీ! ఆప్రదేశమంతయు శత్రుసైన్య
ములతో నిండనీ! అప్పుడు నాలుగువైపుల నుండియు జానకి
తాడు ముట్టింతము." "రాజేంద్రా! ఏమి యీాధ్వని! ఎని

మిదివేలమంది మగధసైనికులు ఖండ ఖండములైన శరీరములతో నెట్లాకసముపై కెగిరినారో! ఇది సార్వభౌముని శస్త్రవిద్యాలాఘవము." "ఆపస్తంబా! ఇంకమీఁదగూడ మగధసైన్యములు అసంఖ్యాకములుగానుండెనా అప్పుడు మనకుఁ బ్రమాదముకలుగును." "దేవా! ఇప్పుడేమి చేయవలెను?" "చేయుట కేమున్నది. రెండు దినముల వఱకును మనమిందు నిర్భయముగా యుద్ధము చేయవచ్చును. ఈ లోపుగా నాగచక్రవర్తి జనకరాజేంద్రుని పట్టణమును జయించి తన సైన్యములతో నిచ్చటకు వచ్చును." "దేవా! ఱేఁపే విజయదశమి, ఏలిక ఱేపుఁ కనకవల్లీ సహితముగా మగధరాజ్యమునకు పట్టభద్రులు కావలసియున్నదే." "ఆపస్తంబా! అది దైవబలముగాని మన బలముకాదు. ఇదె నేను యుద్ధరంగములోని కరిగి యెటునుండి యెటువచ్చునో విచారించెదను."

కనకవల్లి సార్వభౌమునికి నమస్కరించెను. "సార్వభౌమా! నాఁడు శ్రీకృష్ణుఁడు సహాయుఁడై నిలిచి సత్యభామచేత నరకాసుర యుద్ధమును నడపించినాఁడు. ఏలికనాకును నీ చిన్నవరమును అనుగ్రహింపవలెను. లోక కంటకుఁడైన యీ సుశర్మ నరకుఁడును నట్లె కనకవల్లిచేత హతుఁడగును గాక!"

ఇంతలో మఱియొక భటుఁడు ప్రవేశించెను. "దేవా! సుశర్మ యింటిని ముట్టడించిన యాంధ్రసైన్యము లిప్పుడు

అంతిమావస్థలో నున్నవి. అచ్చటకి మన సైన్యముల నంపుటకు వీలులేకున్నది. ”

కనక :—రాజేంద్రా! నా కచ్చటి కరుగ ననుజ్ఞ నిమ్ము. క్షణకాలములో నేను సైన్యములను బాఱఁద్రోలఁగలను.

సార్వ :—కల్యాణీ! యుద్ధమన్న నెట్టిదో నీకుఁ దెలియునా? ఇది పూల మొత్తములపై విహరించుటయు గండుంగోయిలలకు స్వరములు నేర్పుటయు ననుకొంటివా! పరకంఠలుంత నోదగ్రములైన వాడికోల లెక్కడ? కుసుమకోమలులైన సుందరాంగు లెక్కడ?

కనక :—సార్వభౌమా! నా యీ కోరికను నెఱవేర్పక తప్పదు. నేనుగూడ తమతో వచ్చెదను.

ససైన్యుఁడై కనకవల్లీ సమేతముగా సార్వభౌముఁడు సుశర్మ వీటి వంకకరిగెను.

—0—

# పదియేడవ ప్రకరణము.



మహా నవమి నాఁటి రాత్రి సుశర్మ కనకవల్లినిగూర్చి పలవరించుచు రెండవ యామమున నిద్రనుండి లేచెను. "ఏమిది ? నాకిట్టి పాడుకల వచ్చినది. నేను బ్రతికియుంటినా నిజముగా మరణించి చక్రవాళ పర్వత ప్రాంతములందలి ప్రేతములతోనే విహరించుచుంటినా ? ఇది కలగాదు నిక్కువమే. నిశ్చయముగా నేను మరణించితిని. హా! ఏమిది ? మరణమా! కనకవల్లిని పొందకయే నేను మరణించితినా ?" అని యనుకొనుచు సుశర్మ మరల నిద్రించెను. ఆ నిద్రియందాతనికి మఱల కలవచ్చెను. ఆ కలయందు మహాపర్వత మొక్కటి యాతనికిఁ గానఁబడెను. "అదియే లోకాలోక పర్వతము. దానినే చక్రవాళ పర్వతమని పెద్దలందురు. అబ్బా! ఎంత చలిగా నున్నది ? ఈ మబ్బు వెలుగులో ఈ యసురుల సంజ వేళ నే నెంతదూరము నడవఁగలను. రాజాధిరాజనైనను భూలోకములో మగధ చక్రవర్తినై యష్టైశ్వర్యములతోఁ దులఁదూఁగినను, నే నిచ్చట నడచియే పోవుచుంటినా ? అదిగో ఆ దూరమున నిలిచియున్న పెద్ద గుంపెక్కడిది? ఏమియీ జనసమూహము ! ఓహో ఇప్పుడు తెలిసినది ! భూలోకములో నిప్పుడు బ్రతికినవా రెంతమంది కలరు ? భూమి పుట్టి నప్పటినుండియు చచ్చిపోయినవారి సంఖ్యతో బ్రతికియుండిన

వారి సంఖ్యను బోల్చి చూచినయెడల భూలోక మెంతపాటిది యని మనకు తోఁపక మానునా? ఆహా! ఇంతమంది నావంటి వారితో నివసించుట సుఖదాయక మైనది గదా. అవును. ఈ భూమియే యుత్తమ భూమి. ఈప్రదేశ మెంత సమ్మర్దముగా నున్నది ! క్షణ క్షణమునకును ఎంతమంది వచ్చుచు బోవుచు నున్నారో! నాముందు నడచుచున్నది యొకగుంపు. నా వెను కనే యింకొకగుంపు. ఔరా ! యెన్నెన్ని గుంపులుగా ప్రజ లీ మహాప్రదేశమును జేరుచున్నారు. నదులన్నియు సముద్రములోఁ జేరునట్లు నరులందఱును చక్రవాళ పర్వతమును జేర వలయునేగదా! ఈకుండ చట్లేమి? ఈ నూనెదీపము లేమి? ఈ కాకుల గుంపులేమి? ఈ నూవుగింజలేమి? ఈ పొగలేమి? ఈ దేహదాహము లేమి? ఓహో దహనమైన శరీరములనుండి తాపముతో వెడలినవారా వీరు? కానిమ్ము! కానిమ్ము! ఈ మిడిగుడ్లు, యీ కరాళ దంష్ట్రములు, ఈ యెముకల చేతులు ఏమి ఈ విచిత్రము! ఎవ్వరును నాతో మాటలాడ రేమి? ఓహో! ఆ మూల దివ్యదేహములతో కానవచ్చు చున్నవా రెవ్వరు? వారిట్టి యనంతకోటి జీవులకు నాయకుల వలెఁ గానవచ్చుచున్నారో! ఏమది? ఏమని నాకు శబ్దము వినవచ్చుచున్నది? మనుష్యజీవితము బుద్బుద ప్రాయమని యా? ఆ యల్పకాలమును వ్యర్థముచేయక, యెవ్వఁడు తన విద్యాబుద్ధులను చక్కగా వినియోగించుకొని, మరణకాలము నందు—ఏమది! ఏమది! మరణసమయమునందు ఎవ్వఁడు తన జీవితకాలములో ఈ యుత్తమ కార్యమునైనఁ జేసితినని

చెప్పఁగలుగునో వాఁడే సరిగా జీవించినవాఁడనియా? ఎల్లలును జచ్చిపోవువారేనా? అందువలనఁ బ్రతికియున్న కాలములో పరోపకారము చేయవలెనా? వారే యిచ్చట పట్టభద్రులా? ఆకానవచ్చు దివ్యశరీరు లెవ్వరు? వారు మన దేశమువారు కారే? ఒకఁడు హెరాక్లీషియస్సు, ఒకఁడు సోక్రొటిస్సు, ఒకఁడు కాన్ఫూషియసు, అదిగో ఆతఁడు హరిశ్చంద్ర చక్రవర్తి, ఇతఁడు కర్ణుఁడు ఇతఁడు యుధిష్ఠిరుఁడు, ఇందు నాకే పదవి లభించును? పరదారాపహారకుఁడనై, మధుపానాసక్త చిత్తుఁడనై, పరమ పాపాత్ముఁడనైన నాకు ఉత్తమ లోకములా? ఒక్కసారి భూలోకమున కరిగి యికఁ బుద్ధిమంతుఁడనై సంచరింతునుగాక! ఏమీ? భూలోకమున కేగిన యెడల అచ్చట నాకు శరీరమేదీ? చావఁగానే శవమును కాల్చివేయుదురు గదా. అయ్యో! నన్ను భూలోకమునకుఁ బోనిచ్చువా రెవ్వరు? ఇదేమి నాకు ఎగశ్వాసము వచ్చుచున్నది! అయ్యో! నా కాలుసేతులులాగుకొనిపోవుచున్నవి. అబ్బా! ఏమి ఆయాసము! ఏమి యాయాసము. ఏమి యీ దేహతాపము, దాహము, దాహము దాహము! ఇదే చక్రవాళ పర్వతమునకుఁ బ్రయాణము చేయుచున్నాను."

ఈ రీతిగా కలఁగనుచు సుశర్మ చక్రవర్తి ఆరాత్రియే ఆ కలలోనే ప్రాణములు విడిచిపెట్టెను.

# పదునెనిమిదవ ప్రకరణము.

ఆవల సుశర్మ యీరీతిగా కలఁగని ప్రాణములువిడుచు చుండగా నీవల శ్రీముఖ సార్వభౌముఁడు కనకవల్లితోఁ గూడ మగధ సైన్యములను భేదించుకొని రాజ మందిరము పొంతకు వచ్చెను. అప్పటి కచ్చోఁటను ముట్టడించియున్న యాంధ్ర సైన్యములు నామమాత్రావశేషములై యుండెను. శ్రీముఖుఁడు కోటను సమీపింపఁగానే వేలకొలఁది మాగధులు ఆతనినిఁ జుట్టుకొనిరి. హాహాకారములు... హోరాహోరిని కనకవల్లి సైన్యములనుమఱలించి పోరుచుండెను. శ్రీముఖ సార్వభౌము డొక వాహినికిని కనక వల్లి యొక వాహినికిని నధ్యక్షత వహించి మాగధుల పీచ మడంచుచుండిరి. కాని శత్రు సైన్యములు అసంఖ్యాకములుగా నుండుటచే నేల యీనిన పోల్కి నెందుఁ జూచినను మాగధులే కానవచ్చుచుండిరి. కొంతసేఁపటికి సార్వభౌముఁడు నిరాశచెంది కనకవల్లిని సమీపించి "కల్యాణీ! శత్రుసైన్యములు అపారపారావారముగా నున్నవి. మనము గెలుచుట గాని, తప్పించుకొని శిబిరములోని కరుగుటకాని దుర్ఘటముగా దోఁచుచున్నది. " అని పలికెను. "సార్వభౌమా! క్షత్రియులకు శత్రువుల గెల్చుటో వీరస్వర్గము నందుటో ఈ రెండే రణధర్మములు. ధర్మదేవత మన పట్లనున్నది. మీరు బైటి సేవకుల నెదిరింపుఁడు. నేను కోటలోఁ జొచ్చి సుశర్మను

సంహరించి వచ్చెదరు. అల్లదె ! ఆ దూరమున మన శిబిర మునుండి వచ్చుచున్న యాసైన్యము లెవ్వి? అదె ? నా జనకుఁడైన జనకరాజర్షి పతాకము. సర్వ విషమునుండి తెలిసి నాతండ్రి సైన్యములతో మనవంకకు వచ్చుచున్నాఁడు. మన కిఁక భయము లేదు. " అని కనకవల్లి పలికెను. పదివేల మంది సైనికులతో, జనకరాజేంద్రుఁడు పురిలోని మాగధు లను జెండాడుచుండెను.

ఇంతలో అపుత్రికుఁడైన సుశర్మ చక్రవర్తి మరణించె నన్న వార్త లోపరించబడెను. మగధసైన్యములు కడువిషాద మునొందెను. "రాణులు సహగమనోద్యుక్తులై యున్నారు. చక్రవర్తి నిర్యాణమందినాఁడు. మగధరాజ్య మాంధ్రుల పాలైనదని పట్టపు రాణి మఱింత వగచుచున్నది. " అను వార్త వినవచ్చెను. సార్వభౌముఁడు వెంటనే విజయపతాకము నెత్తెను. "చక్రవర్తియైన సుశర్మ మరణించినాఁడు. రాజ్యము ఆంధ్రుల స్వాధీనమైనది. నేపఁటి దినమున శ్రీముఖ సార్వ భౌముఁడు భరతవర్షాధి రాజ్యమునకు బట్ట భద్రుఁడు కాఁగో వుచున్నాఁడు. మాగధులెల్లఱును తెల్లని పతాకముల నెత్తు కొని పోరుమాని తమ యిండ్లకు బోవలసినది. " అని వార్తా హరులు కోటయందును బురమునందును జాటించిరి. సార్వ భౌముఁడు ససైన్యుఁడై కోటలోఁ బ్రవేశించి, సుశర్మయున్న తావున కరిగి ఎల్లఱను ఓదార్చి యాతనికి రాజలాంఛనముల తో నుత్తరక్రియలు జరుపుట కాజ్ఞ యిచ్చెను.

మఱుదినమున జయజయధ్వానములతో రాజును గనక వల్లియు పురమూరేగి, గురుదేవబ్రాహ్మణులకును బౌద్ధసన్యాసులకును, బౌద్ధాలయములకును నవ్వారిగా ధనము లొసగిరి. జనకచక్రవర్తి యానాఁడే కనకవల్లిని సార్వభౌమున కిచ్చి వివాహముచేసెను. వివాహానంతరమున సార్వభౌముఁడు కనకవల్లీ సమేతుఁడై పట్టభద్రుఁడయ్యెను. పట్టాభిషేక సమయమున మన నరపాల దేవేంద్రుఁడు సర్వజనులకును సుఖమును సౌఖ్యమును గలుగునట్లు పరిపాలింప శక్తి నొసఁగుమని యీశ్వరుని వేఁడుకొనెను.

అప్పటి కప్పుడే యచ్చటఁ జేరియున్న భట్టబాణుఁడును ఆపస్తంబుఁడును విప్రబృందమును లేచి "రాజకులావతంసమా! ప్రజలు సుఖులై యుండునట్లు నీవు న్యాయమార్గమున రాజ్యము పాలింతువు గాత ! గోబ్రాహ్మణులకు నీ పరిపాలనాకాలమున సుఖమగుఁ గాక ! బౌద్ధులు గూడ అకటంకముగా తమ మతధర్మముల నాచరింతురుగాక. సమస్త లోకములును సుఖించును గాక ! పర్జన్యుఁడు సకాలమునకు వర్షించును గాక ! భూమి సస్యశాలినియై సంవత్సరమునకు మూఁడు పంటలు అవ్వారిగా పండునుగాక, ఈతిబాధలు యుద్ధములు కల్లోలములు లేకుండ దేశములు క్షోభరహితముగా నుండునుగాక ! అపుత్రికులు పుత్రివంతులగుదురు గాక. పుత్రిలు గలవారు మనమలను జూచుగాక. ఎల్లరును దీర్ఘాయురున్నతులతో జీవింతురుగాక ! ధనము లేనివారు నీ రాజ్య

కాలమున ధన సంపూర్ణులగుదురుగాక ! ఎల్లవారును దేహ మనోరోగములు లేకుండ నూరేండ్లును జీవింతురు గాక." అని యాశీర్వదించి మంగళాక్షతలను జల్లిరి. సువాసినులు హారతి పళ్లెరమును గేలఁగొని సార్వభౌమునికి గీతములను బాడిరి.

శ్రీముఖ సార్వభౌముఁడు భరతవర్షమున కంతకును పట్టాభిషేక మందెను.

